గద్య-

ఇది శ్రీమన్మంత్రిప్రెగడవంశపయఃపారావార రాకాసుధాకర రాజబిరుదాం
కిత భుజంగరాయామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్ర దుర్గామల్లికా
ర్జునప్రసాదరాయవరపుత్త్రి శ్రీమార్కండేయ వరప్రసాదజనిత
కవితాధౌరేయ బుధజనవిధేయ భుజంగరాయనామధే
య ప్రణీతంబైన వారకాంతయను చాటుప్రబం
ధంబు నందు ద్వితీయవిలాసము.



శ్రీరస్తు

శ్రీమార్కండేయస్వామినే నమః.

# వారకాంత.

## తృతీయవిలాసము

క. శివసద్గ్వాలోకనుతయుప నవమూర్తివిరాజమానవలినాక్షశరా
సనకుముదనీశచూడా భవభవసాశాపహారపటుతరనామా ౧॥

గీ. చిత్తగింపుము పైకతఁ జిత్తమలర నాతఁ డత్తరుణీమణియందుఁ దగిలి
యున్న మేలుఁ గక్రప్రతివిశముట కువచ్చి పోవుచుండె నా భోగినీభోగపరత ౨॥

క. పలుకుం బలుకునఁ దేనియ లొలుకన్ గాటానురాగము ట్టిపడంగాఁ
గలకలన వ్వనోకప్పుడు తలతలయునియందునందుఁ దార్కొనుచుండున్ ౩॥

సీ. ఖేటీమనోభవఘోటీసుంఖళన ధూటీవిలాసముల్ త్రోచి త్రోచి
చేటీకరానీతపీటీరసామోద పాటీరగంధముల్ మీటిమీటి
శాటీలసత్తులాకోటీమణీమయ కోటీరముల్ దగఁ గూర్చికూర్చి
ఆటీకితద్రుమవాటీకనత్సరీ పాటివిహారముల్ బరపిపరపి -

గీ. చకచకలనీను మణిమయముకురనికర సుకరబహుబింబవిమలశీతకరదర్శ
నకరణానంద విలాసముల్ ప్రకటపరచి పల్లవాధరతన్నిజంగొల్లలాడె ౪॥

చ. పడపు మెలంత వన్నియలు బాల్పడ వెవ్వరికేని యొక్కమా
టాడలిరియించినీల్గుమతియొక్కెడసోఁగనురుల్వ్రీడలిబ్భ్రమో
మ్ముడిముడుజారుచున్నచనుపుట్టము పైనమరించుననందయల్
గడబడెఁంచొయ్యారమునదంటదడి మైసవరించునొక్కచోన్ ౫॥

ఉ. మోహమునందుమాడ్కినర మోడ్చుచు గన్గవమారు బారికిన్
దాహము నొందుపోల్కినదనమ్మునూర్పులు వుచ్చుచుల్లన్
బాహువులూముచున్నదమఁబాపము కేశవరావు వీని చే
దోహలమైనునంబరిలధూతపటంబు క్రియంజలింపఁగన్ ౬॥

ఆ. చుంబనాశ్రమంబు నూదితాకినపోల్కి నంతరంగమింతి నంటియుండ
మత్తుఁగొన్నరీతిఁబొత్తువీడఁగలేక దానియింటనువికితబుచు జేసె ౭॥

చ. గుసగుసలాడుకొంచునొకకొందఱు చుట్టలు మెల్లమెల్లఁగా
హాసనముఁజేసికొందఱువయస్యలు కేశవరావుగారికిం
పెసఁగు నెయంచుఁగొందఱటు లెచ్చటికేగెదరంచుఁగొందఱు
ల్లసములనాఁడసాగిరిచలంబునుఱంకునుడాంచశక్యమే ౮॥

## కేశవరావుభార్య అత్తమామలతోఁజెప్పియేడ్చుట.

వ. ఇట్టి దుర్వార్త పెనుగాలిందూలు శాల్మలీతూలంబు చదంబునం జెదరి యొల్లెడలం బ్రమ్మి వానియిల్లాలగు లక్ష్మిచెవింబడిన నామెయుఁ జెచ్చెర నత్తింటికివచ్చి మగని చేష్టలంగని పెట్టి యత్తమామలచెంతఁ గన్నీళ్ళుం గుక్కకొనుచుండ వారలిట్లనిరి.

శా. అమ్మా కన్నులనీరు వెట్టెదవదియేలా యెల్లచుట్టంబులున్
సమ్మోదంబుననున్నవారలుగదా శారీరసౌఖ్యంబులో
పమ్ముం జెందకయుండునే విభుఁడునిన్ బాధింపకుండెంగదా
యిమ్మాడ్కిన్వగ పొందవెన్నఁడును నేడీచింతయేలాయనన్ ౧౦॥

ఉ. నాకు శరీరసౌఖ్యమొక నాటికిఁదక్కువగాదు సౌఖ్యముం
జేకొని చెల్లబంధువులుఁ జెప్పఁగ సిగ్గగుచుండెఁ దొయ్యటన్
మీకొమరుండొనర్చు పనిమేకొని యూరకయుండఁజాలక
యేయ్యకనకాంగియంచొక తెయుండెనిఁకేమనివిన్నవింతు చెదన్ ౧౧॥

క. నావుడుగుండెలుజల్లన భావంబులు తల్లడిల్లి వాణఁ గొదవంగా
నీవంశపుగీర్తులుజెడఁ గాపీనుజనించెననుచుఁ గలఁగిరి వారల్ ౧౨॥

ఆ. తల్లి నీవు మాకుఁ దనయపోలికనుంటి వేమి చేయవచ్చునీదురాత్ము
నందలింతుమమ్మ మాశక్తికొలఁదిని నూరడిల్లుమనిరి వారలపుడు ౧౩॥

భీతిం జెందుము నేయుపాయమునఁ దప్పింపంగ నోవంచునీ
రీతిం బూనె నిఁకేమి చెప్పఁ నుమ యంగేంచి పల్కెం దగన్ ౨౩॥

ఆ. వాయి గ్రమ్మియున్న పాతకూపంబొకొ పాదవిపట్టుచున్న బోసి పులియొ
యనఁగ నొక్కనాఁడు కనకాంగిజనయిత్రి పొసఁగ రామదాసు పుత్త్రి డాసి ౨౪॥

ఉ. అల్లుఁడ నేఁడు నీదు ప్రియురాలు త్రపాకులితాంతరంగయై
తెల్లము గాఁగ నీకడను దెల్పక నాకడ నైనఁ గొంకుచు
న్నెల్లఁ దివ్వెపండ్లు గసమీపముఁ జెందెను మేను దీకృతం
బల్లవరాగమే ననపరుపందగు నంచు వచించె నావుడున్ ౨౫॥

కేశవరావు వరాల పేరుం దెచ్చి కనకాంగి కిచ్చుట.

ఉ. ఆతఁడు బల్కె నీవడుగునంతకు నీగతి నూరకుంటి నే
ఖ్యాతియొయ స్వతంత్రుఁడను గావున నించుక కొంకుచుంటి నీ
రాతిరి కోర్చియున్న నువరాలొనగూరిచి కట్టిపెట్టి మా
తాతలనాటి పేరొకటి తప్పక తెచ్చియొసంగుదుం జుమీ ౨౬॥

మ. అ యారాతిరి యింట నే పడక వేయన్ మేరుతుల్యంబుగాఁ
గనకంబబ్బిన నాలె లక్ష్మియును వేడ్కం గూడియుండంగ జ
య్యని నీచె తవరాల పేరునిట తెమ్మంచున్ వెసం గొంది యి
చ్చెఁ బ్రత్యూషమునందె తెచ్చె నొసఁగ స్త్రీరత్నంబు గాదానికిన్

వ. అయ్యెడ ౨౮॥

సీ. చిందులాడెడు మెట్టెలందెలు మేళమై కరము సొంపు నగళ్ళు గళ్ళు మనఁగ
సమయంబుఁ గని పెట్టిచన్నవయుదరంట దొరికిన లేగాను సుక్కుచుండఁ
బ్రతిబదంబునఁ దూలిపడుచుఁ దూగాడు మంచి కుదురు పైజడకు పెంపు చాల
ఎమ్మె తక్కువయాట నించుక వేళ్ళ చేసారించు మపయ్యెద జారుచుండఁ

గీ. జిగిగవు వెన్నెలలు తమ్ముఁ జేరప్రియుని దృక్చకోరములకు విందు దేల్చుచుండ
మోదము ప్పొంగవచ్చి యమ్ముద్దుగుమ్మ గాఢతరముగఁ గేశవుఁ గౌఁగలించె. ౨౯॥

పాప కూఁతురగు కనకాంగికి మాయోపాయంబులు దెల్పుట.

ఉ. పిమ్మటఁ బాపయొక్క తతి బిడ్డను జేరఁగఁ జీఁటియిట్లనున్
సమ్మతిఁ బుట్టఁ జేసియును జయ్యనఁ గోపనఁ జూపి వాంచి
త్రిమ్మతి రక్తి నున్నయెడఁ దారొకనాఁ గొనరించియుండగన్
నెమ్మది మీఁ అవిత్తము నుసేర్పఁగలాఁగఁగఁ జాలవేమఁ కన్ ౩౦॥

గీ. సానిబిడ్డవుగాని సంసారిణివఁటె చిన్నదాన వెనీకెన్ని చెప్పఁగలను
కలిపి పెట్టినయన్నంబుఁ గఱపి పెట్టి బుద్ధియును మానవులకేమి పుష్టిఁ జేయు ౩౧॥

క. జవ్వనము శాశ్వతంబే యివ్వడి దేహంబునందు నించుక తగ్గన్
గివ్వకుమార వుసుమ్మీ యెవ్వఁడుఁ గన్నెత్తి నిన్ను నీక్షించఁడు గా ౩౨

క. వేవేగ మెదవ మెల్లన్ దేవంగా వలయుఁగా దెతీపున్న పుడే
తీవియ బోఁడీ మనమిఁక నేవిధమున బాగుపడుదు మెంచుము బుద్ధిన్ ౩౩॥
మ. తరుణీ మున్ను ప్రాయ మొందిన చతురత్వం బెంత యో నేర్చినీ
సరి రాకాపల్లవపాణి యే పురుషు మేయి మేజస్త్రీ యిటు వారి కిన్నిరం
తరమున్ జేబున వేసి లంచములు కుండాఁగా సియుండున్ రా
సరియే డాదికి వేయి రూప్యకములు న్సాధించలే వేమనన్ ౩౪॥
క. బెట్టుసరిన్ ధనము నురాఁ బట్టు మతఁడు రాగ మింటి పడఁతుక యందుం
బుట్టించు నీచేతం బెట్టఁడు పైసయును నిన్ను పేక్షించుఁ జామీ ౩౫॥
వ. అనిన విని యట్లు చేసెద నని ౩౬॥
ఉ. కన్నె తికంబు నాటిసుద గాని నుఁ గోరుము నెన్నె యెన్ని యో
యెన్నుచునుంటి నేటికి మదీప్సితములు మకూరె నీవు నే
నెన్నఁడు బాయకుందమిటు లిష్టము యేనియు బాసఁ జేతమం
చన్నెలినాతి వల్కనతఁ డట్లొనరించె వివిశ్చలాత్మతన్ ౩౭॥

కనకాంగి కేశవరావుతో లక్ష్మిపై నిందలు మోపి చెప్పుట.

గీ. అకటవనుజా చివలవలలాడుచుండు నేమి చేసితి నీ భార్య కేంటంచుఁ
గొండెములు వల్కె కేశవాఖ్యునకు సాధ్వి యఁట నెయ్యము దొలఁగంగ నాడుచుండు॥
క. ఒకనాఁడు కేశవునికం శుకముఖభూషలను దాఁచి సుదతీమణి వీ
థికిఁ బోకు దృష్టిదోషము నకు లోఁబడుదువో యటంచు మనగుచుంబలికెన్ ౩౯॥
క. ఆరమణునినొకవేళం జేరలతోఁ గనలు మూసి చెప్పుము నే నే
చీరంగట్టితి రవికయు నేరీతిదినీదు నేర్పు నెంచెద నని యొన్ ౪౦॥
ఉ. చుట్టలు చెంత నుండ నొకచోనును కాటుక కన్ను దోయి కిం
బెట్టుచునుండఁ గేశవుఁడు మెల్లనఁ జాటున వచ్చి చేలముం
బట్టుకొలాగ నుస్సు మని బందులు చూచుచు నుండె రయ్య యో
యిట్టుల వేగపాటు గద యెల్లపుడంచు నొకింత నవ్వెడిన్ ౪౧॥
ఉ. వెన్నెలబైట సజ్జపయి వేడుక కాఁడు పవిష్టుఁ డైనచో
గిన్నెలఁ గందమత్తరు వొగిన్ మెయిఁ బూయుమ నింతి యట్లనుం
బెన్నిధి నాకు నొక్కటి లభించిన నాజన యిత్రి యా శవీ
ర్యుక్తిను నెన్నఁ డేనియు నుదొందర జేయక యుండుడబ్బుకై ౪౨॥
ఉ. ఇంతటి వేళదాక యెట కేగితివీగతి సోఁగలౌ శిరో
జాంతిము లేటికిం జెదిరె నంబర మేల నలింగె నిట్లు మే
నెంతయు వేసబం బడఁగ నేమికతం బొనిజంబుఁ జెప్పు మే
కాంతకు నొప్పు పండె నిగద్దతి యిటలు వల్కె నొక్కెడన్ ౪౩॥

మ. విటుఁడే తేరెడి వేళ బాగియతఁడు న్వేవచ్చియబ్జాక్షి తా
నెటకోయే గనటంచు సంశయముతో నీక్షించుచుండంగ వె
న్కటిత్రోవంజని సెజ్జఁ జేరియతనిం గౌఁగింటలోఁ జేర్చి సే
నెట కేతెంచితివంచు వాకలతతో నీక్షింతు నో కొల్లయనున్ ౪౪॥

వ. అప్పుడప్పుడ కేశవరావు మానసంబు వశపరుపం దలంచుచు కనకాంగి వానికి నిట్లని పల్కుచుండు. ౪౫॥

క. నోచితి నెంతయు నీకై యూచకుండదనుచుఁ గాన నితరులకన్యల్
బూములు గదనన్ను న్విడఁ జూచితి వేని యును నిడువఁ జూతుం దనువున్ ౪౬॥

## కనకాంగి తనతల్లిచర్య కేశవరావునకుం జెప్పుట.

క. నినువిడచియన్యుఁ గూడం జనుమను మాతల్లి ధనము సంపాదింపన్
నినువిడఁ జాలన్ నీవా ధనముం దానికిని సంగితగఁ బోవునను ౪౭॥

క. లోకులకు వెఱచియుంటం గాక భవద్గేహమందు గదియొకటియిడన్
నీకడ నేనివసించెద నాకసుఖము లెల్లమిగులనందఁగ వచ్చున్ ౪౮॥

ఉ. ఇక్కడనుండి సొమ్మునకు నేడ్చుచునుండును నాదు తల్లి నే
నొక్కక్షణంబు నీకడన యుండినఁ బిల్చుచునుండు సౌఖ్యముం
దక్కదు గాన నానుడి వినందగు మీభవనంబు చెంత నా
కొక్కగృహంబుఁ గట్టియిడనుండుము నిన్నెడబాయ కెప్పుడున్ ౪౯॥

శా. నాకుంగన్నె పెఱింపు నాథుఁ డిటనున్నంగీము బంగారమే
కాకిట్లుండె నె సౌఖ్యపర్యమతఁ డేఁ ట్టించె నేనన్యునిం
జేకోఁ జాలక యుండియుండితుదకుం జేకొంటి నిమ్మించుచున్
మీకున్నా పయిఁ బ్రేమ లేదు గద నెమ్మింజూతు రే పూరుషుల్ ౫౦॥

ఉ. ఆపణవీధి నీవు సరిగంచులదోవతిఁ బూనిరాఁగ నీ
వా పువ కేగుదెంతునని చూపుడు సొమ్ములుఁ బట్టురైకయుం
దోపుపటంబుఁ దాల్చుకొని తోనరుదేంగ వేడ్కనుంటి నే
నా పఁగఁ జాలనైతి మదినప్పటినుండియు నిన్నుఁ జూడఁగన్ ౫౧॥

గీ. పాపదైవంబు నన్ను నీభార్యఁ గాఁగఁ జేయకీపాడు వేశ్యగాఁ జేసెఁ గట
యిరువురికి నొక్కకులమైన నేల చేయఁ డొక్కచోఁ దినియొక్కచో నుందుము గద॥

గీ. బాసలొనరించి ప్రేమముఁ బరఁగఁ జేసి యొక్కకపటంబుఁ బన్ని యిట్లూరకుంటి
ప్రేమగలవారి వీడుట వృజినము గద పురుషులకు నీతియను మాట బాడమఁ బోదు ౫౩॥

క. నాపయి మీ పౌరుషముం జూపుటపిచ్చుకకుఁ బైనిఁ జాఱుచు బ్రహ్మా
స్త్రోపాయము నన్నిట్లుగ సేవన్నేఁ జేయఁగలఁడి యేదియుఁ గలదే ౫౪॥

వ. ఒక్కనాఁడు కనకాంగి కేశవరాయని వచ్చువేళఁ గని యథాపూర్వంబుగా నుండ

కకిలకిలన్ నవ్వుచు నెదురేఁగక కుపితచిత్తయుంబోలె నున్న నక్కాముకుఁడు వచ్చి బా
లిం గాంచి గుండియలు జల్లుమన నిట్లనియె ౫౫॥

ఉ. ప్రాణసమాన నీ వువినయంబున ద్వారము చెంత నుండి నా
పాణితలంబు నీదు కరపంకజమందరించిన వ్వుచుం
బోణిమి మా యహర్ష్యమును బొందఁగఁ జేసి మనోహరంబుగా
వీణియ మీటుదాన విటు విన్నదనంబున నుంటి వేమొకో ౫౬॥

క. ఎలనాఁగ లెమ్ము నీవా క్కలనాదామృతరసంబుఁ గణఁగాయుఁ గ్రో
త్ఫులనానకుండ నోర్వం గలనా నాతోడ నీకుఁ గలనా చెపుమా ౫౭॥

ఉ. అప్పుడు చిట్టిపాప వినయాఢ్యయుఁ బోలె వచించె నిట్లుగాఁ
జెప్పెదఁ జక్కఁగా వినుమి నీ యిది మైఁ బొగరెక్కి యాక్రియన్
దిప్పరఁ బెట్టుచుండె మదిఁ దృప్తి జనింపక యూసపడ్డచోఁ
దప్పక నిందఁ జెందును గదా పురుషుండు వధూటి యున్ మహిన్ ౫౮॥

పాప తన కుమార్తెకోరిక కేశవరావుతోఁ జెప్పుట.

గీ. ఒకరియింట వివాహమహోత్సవమున నాగవాసంబు విజయాఖ్య నగరినుండి
వచ్చె వారలు దొడఁగిరి పలకపూస, సేవళంబులు నవరీతి నెగడుచుండు ౫౯॥

చ. అవికలయంగఁ జూచితి నకట్టవి గావలెనంచు గట్టిగాఁ
బొవులుచునుండె గేహమున నుబ్బుత్తడి ముద్దులు పుట్టఁ బోవురేఁ
బవలును నిన్న సౌమ్యులని బాధయొనర్పఁగ నోరు రాదుగా
రవమిటులైనచోఁ దనకు రాదుగదా యికఁ దెల్వి గల్గునే ౬౦॥

ఆ. పసిఁడి పూఁతగిండి పగిది గానొకరీతిఁ గాపురంబు మెఱుఁగు గానరాఁగ
మెలఁగి వలయుఁ గాక పలు పెద్ద పోకలు బోదు రేని కూలిపోరె యేరు ౬౧॥

చ. పొసఁగ నిపట్టుఁ బట్టియటు పొక్కుచునుండును నేటికీ వునీ
బసకరు దేరనిన్ని యును బాగుగు నోఁపటి కంచుఁ బంచియ
మ్ముసలి దిపట్టికిన్ మజలబోధయొర్చ్యయథాస్థితంబుగా
నెసఁగఁగఁ జేసి కాముకున కిట్లనియెన్ మనునాటి వేషవన్ ౬౨॥

ఆ. గట్టిగుండె గలది పట్టినిదూరంగఁ దగిదుగాని నీరుఁ ద్రావకుండె
నన్నమంటకుండె మున్నటినుండియుఁ జేయుబోనదాని చెవిసిఁ జొరదు ౬౩॥

మ. పరుల న్వేడఁగ నుద్యమింపదు గదా ప్రాణంబుతో నుండియే
కరణిం జూడఁగ నోర్తు నోర్తుఁ గదనా గర్భంబు నంబుట్టెఁ గూఁ
తురుమున్నా ళ్ళుపవాసమయ్యెను మందుఃఖించెఁ గన్నీరు బి
ట్టురలన్ వేశ్య లబూటకంబు లితరుల్ యోజింపఁగా నేర్తురే ౬౪॥

క. అది విని కేశవరావును బదఁపడి నీవింత చింతఁ బడకుము పాపా
యదియెంతటి వెలఁ గలయది పదునూనూటులో నో తెలియఁ బల్కుమటన్నన్ ౬౫॥

శా. అల్పార్ఘంబునఁ జేతఁ జేరునది గాదల్లొట నేనీకడం
చెల్వంబాలక యూరకుంటివి మిముం దే తెమ్మనన్ శ్రీదు తే
కల్పాగంబులె మీరు కాపురములం గాపాడఁ గావద్దొ మీ
పొత్తే మాకును పొల్పుమీరు చెడ మమ్ముం జూతు రేయేరనన్ ౧౬॥

క. గొడ్డుదియును నాఁకఁట వెతఁ బడ్డజము నిజాచిమి గుల వగఁ బొందుఁగదా
దుడ్డెలఁ గన్నదియటు పై బిడ్డకుని బ్రైన నెంత వెత నొందునొకో ౧౭॥

క. మక్కువ నాకుం గలదని యక్కరితిం జెందునదియుఁ గాదిది యెంతో
పొక్కుచుఁ జెప్పఁగఁ బోఁగెన్ నిక్కంబుగ నూరకుంట యిందవ్యము నాకున్ ౧౮॥

గీ. అనుచుఁ దలపోయుచో జరద్వనిత వల్కె నాస పడియా వ్రపాదు గల్లఁగోనిచ్చె
చందమగు నిన్ను దానికిఁ జాలినంత సొమ్ముఁ దెమ్మనఁ బోక యుపాయమ్ము వినుము ౧౯॥

## పాప కేశవరావుతో వస్తువ్రకిమ్మతు చెప్పుట.

చ. అదియొక వేయి రొప్యములయర్ఘ్యము నందనరారుచుండుము
ప్పదిపదులై రొక్కమును బట్టుక తెచ్చియొసంగి తక్కుడె
బ్బదిపదులప్పగొంటివని పత్రము వ్రాసియొసంగుమయ్య నే
నదిగిరవుంచియొక్క యెడనర్థము దెచ్చెద చూతమాపయిన్ ౨౦॥

క. ఎఱిఁగియొ యెఱుఁగకొయుంటిన్ మఱియొక సంశయము మీరు మదిఘంచకుఁడీ
కొఱఁత ధనము నాకుం జే కుఱ మింబత్త్రింబు మిమ్ముఁ గోరన్ వలసెన్ ౨౧॥

మ. అకటా యాతని లౌకిక ప్రతిభ యేమైపోయెనో వార నా
రికిలో నైనసమస్తముఁ జనును గూర్చిన్ దాని మంచంబు చెం
తకు వే వేగమె యేగి మమ్మునిటులం దంటాలఁ బెట్టంగనీ
కౌశలాభఁ బటెలేచి చెప్పుమి దెనీయుల్లాసముఁ దీర్చెదన్ ౨౨॥

క, ఏమే హేమలతాంగి యేమే యామోదరుచిరషీమకరవక్త్రా
యేయే తామరసాక్షీ యేమే మోమెత్తి చూడవేటికె యలుఁగన్ ౨౩॥

క, అనమ్ముద్దియ మెల్లన స్తనతట విస్రస్త పటము సవరించుచు చూపీ
డిన కొప్పు ఘడి చికొను మం గినుకదనుకు ముండ నెట్టకేలకు లేచెన్ ౨౪॥

ఉ, లేచియొకింతయూర్పులు చలింపఁగ వానినిఁ బులుకు వుల్కునం
జూచియి దేమి యయ్యపలుసోద్దెము నాతలనొప్పియుత్తిఁ గా
నో చెలయేచ సాగిరిము హబార్తము నన్ శయనింపనియ్యరే
మీ చెవి నేమొకోవిని చెమ్మృత్యువు నాకిది తల్లి గాదు గా ౨౫॥

ఆ, మేనజబ్బు వొడమె మీ కేల బాధ యెమటఁ బల్కుచుం దురింపు గాను
గన్నమాటువడినఁ గావలె నేమీను నాదు బాధ మఱియు నాతలంపు ౨౬॥

## కేశవరావు కనకాంగియభిప్రాయమడుగుట.

ఆ. అనిన బడపుకత్తె కాంతఁడిట్లను జిత్త బాధవలన మేనిబాధ వొడము
నొండుగల్గనీకు నొండు జెప్పఁగ నేల నీదు నెగులుఁ దెల్పు నిశ్చయముగ ౨౭॥

చ. నిను నెడబాసి నేక్షణము నిల్వఁగఁ జాలదు నా మనంబు నా
ధనము నాదు ప్రాణములుఁ దప్పక సర్వము నీవె సుమ్ము నె
మ్మనమున నమ్మవేని యనుమానక బాసయొనర్తుఁ జూడుమి
ట్లనకుము సహ్యభాషితశరాహతిఁ గూల్పఁగ నీకు న్యాయమే ౨౮॥

ఆ. ఇట్లు బల్కుచున్న యెమ్మెకానినిఁ జూచి పడపుపడఁతి మఱలఁ బలికె నన్ను
నడుగ నేల మీకు నడువ దేమాయమ్మ యడిగియుండి యడుగు టేమి సొగసు ౨౯॥

ఆ. అంతఁ గాంతుఁ డింతి మంతనంబునఁ బల్కె నింత పంత మింత వంత యేల
గాంత వింత గాను గాంతు వే నా చెంత నింత యంతరంగ చింత మాటి ౩౦॥

వ. అనియొక్కవాఁడు ౩౧॥

ఉ. తండ్రియు గర్భగేహమునఁ దాఁచిన పేటికఁ జొంగ్యవృత్తి నె
వ్వఁడును జూడకుండఁగ రవంబు జనించక యుండ ధైర్యముం
దీండ్రిల మాఱు తాళమునఁ దీసి శతత్రయ రౌప్యములు వడిం
గాండ్రియతండు దెచ్చి గణికామణి కప్పన సేసి వెండియున్ ౩౨॥

క. పత్రంబును వేశ్యాజన యిత్రికిఁ దన చేత వ్రాసి యిచ్చి ధనంబున్
ద్విత్రదినంబులలోనా చిత్రీంకారమునకుఁ జేర్చి యొసంగెన్ ౩౩॥

వ. ఆపత్త్రంబుఁ బండ్రెండువన్నెల మెఱుఁగు రుక్మంబు విలిచి నా డెంపు చేతం బ్రసిద్ధుండగు నొక్కనాఁడింధముని చేత నొక్కనాఁడును విడువక కొన్ని దినంబుల కాయాభరణంబుం జేయించి యిచ్చెం దదంతరంబ ౩౪॥

ఉ. అదిమొదలా సరోజముఖి యర్ఘ్యము పాద్యము నిచ్చుచుండె నె
మ్మదికి హితంబొనర్చు మనమాటికి నవ్వులు హాస్యవాక్యముల్
గొదుకక పల్కు మఱలు గొల్పి యనేక విచిత్రభోగసం
పదలను గొన్ని నాళ్ళతి నిభావము మెచ్చఁగ వేడ్క సేయుచున్ ౩౫॥

మ. ఒకనాఁ డొక్క వసంత కాలమున నత్యుచ్చాగ్రమౌ మేడపై
నకలంక స్థితిఁ బండు వెన్నెలలు గాయం దావులన్ని ఘుట్టాం
తిక వాతంబులు జల్లనుల్లవిరులన్నిండైనపూసజ్జనా
యకుఁ డుండం దగఁ బక్కఁ జేరి మధుర వ్యాహారముల్ పల్కుచున్ ౩౬॥

క. నాకుఁ గలకోరు వల్లెన్ నీకడ వివరింపకుండ నేర్చదనె ప్రియా
వాకొందునను చుఁ గొఁగిటఁ జేకొని యమ్మధుర వాణి చెప్పఁదొడఁగెన్ ౩౭॥

ఉ. నా జనయిత్రి దుర్గతి ధనంబున బ్రాణములం కెఁబెట్టు నే
పూజ యొనర్చి దీనికి నిబుట్టితి నొకడు ప్రాణనాయకా

రోజున నొక్క పైసయును రోయిడఁ జాలదిఁ కేమి సేతు నే
యోజనభీష్టవస్తువుల నొందెడు సౌఖ్యము నాకుఁ గల్గెడున్ ॥౮౮॥

శా. ఆశీతాంశుముఖిన్ వచించె నతఁ డీట్లాలాగు సందేహమే
లా శోభావతి నేను గల్గఁగ మనోశాల్యంబు వీడందగుం
బైశాచప్రతిబంధ మాయన నన న్నాతండ్రి బాధించుఁ గా
కాశంకంబడకున్న నీగృహమునిష్టార్థంబులన్నింప నే ॥౮౯॥

చ. దినదిన మొక్క రౌప్యకము దెచ్చియొసంగుదునంచుఁ జెప్పి మె
ల్లనఁ దనతండ్రి మంచపుతలాడక డంగలబీగ మెత్తికొ
ట్టునఁ గల ధాన్యమప్పుడపుడున్ వెలకిచ్చి ముఁదదనంబున
వ్వనజముఖీశిరోమణికి వైశిక వేతనమిచ్చు శంక రో ॥౯౦॥

## రామదాసు రోగగ్రస్థుఁడయి చనిపోవుట.

ఆ. ఇట్లు కొంత కాల మేగుచునుండంగ దైవయోగ మిట్లు దప్పవచ్చు
రామదాసు దేహమామయగ్రస్తమై పీఠపూజయ నెడు పేరమాసె ॥౯౧॥

సీ. జయగంటలును తాళచయమృదంగంబులు విలిచి తాంబూలంపు వెలకునిచ్చి
పూజసల్పెడు పాత్రములను బంధకముంచి మేలిచీరలకని మెలఁతకొసఁగి
వెండిసంపుటములు వెలువక చెలపించి కింకిణుల్ ముదితకుగీలుకొల్పి
కనకవిగ్రహములు గఱఁగించి దానికి హస్తకంకణములనమరఁజేసి

గీ. కామరుఁడీగతిఁ దండ్రి దేహమున దెవులు పెఱుఁగుకొలఁదిని బీరంబుఁ దఱుఁగఁజేసె
కాముకులు మంచిచెడ్డలఁ గాంతురెట్లు గణికనొక దేవతను గాఁగ గణుతి సేసె ॥౯౨॥

క. అమలమతి రామదాసుం డ్రమము నక్షీణించి యొక్క కాలము సీతా
రమణుని మదిలోనెంచుచు నమరవరపురప్రయాణ మమరం జేసెన్ ॥౯౩॥

ఆ. వారి భూరి విత్తవారి యించించుక పారలింత పారలిపోవుఁ గాక
యింక ముందుసలము లేగతిఁ జేకూరు దిట్టమైనయట్టి కట్టువిరిగె ॥౯౪॥

వ. ఇట్లు పితృవియోగంబైన శోకంబునకు వెఱవవలయునను శేనిదుఃఖంబున నిం
చుక చింతించి వెలిబెట్టుదురను భీతినొల్లియొల్లకగా సార్వకైహికం బాచరించు
చు నిపాపంబుల యెడ నిజయేటికని చింతింపుచు నట్టిదశ రాత్రమధ్యంబున నో
క్కనాఁడు ॥౯౫॥

ఉ. మదిగనకాంగి పైఁదగిలి మాటిన వేసము గల్గియుండుటం
బెదరక యర్ధరాత్రము భీకరసంతమసంబుతోడుగా
వెదకుచు వచ్చి దానిగృహవేదిక చెంగట నిల్చి మెల్లనం
గదిపెఁగ వాటమాజన త్రిక్కునదీసి వచించె నాతనిన్ ॥౯౬॥

## పాప కేశవరావును మందలించుట.

క. ఇటులేలవచ్చితయ్యా కటకటనీ చేయుకర్త కాండంబెల్లం
దటుకునఁ జెడిపోవుందునె కుటిలఁపుపనిఁ జేయ నెల్లకోరికబుట్టెన్ ౯౭॥

ఆ. ఇంత వెలఁదినైన నెనయరీదినముల వారవనిత పొందువలతువయ్య
యశుచి వెననిన్ను నంటంగ మాకంత పాపభీతిలేదె పదుముపదుము ౯౮॥

వ. అనిన నాతండిట్లనియె ౯౯॥

ఉ. పొందు నెయిట్టిపల్కకుఁడు పోయిననొక్కఁడు మైల నేగతిం
జెందును జెందనేని పెనుచీకటికైవడి వచ్చి క్రమ్మె నే
హిందువులిట్టి వెట్టిఁబడి యే చెదరన్యుల కేల లేదొకో
కొందఱి మేనుభూతముల కూడిక చేజనియింప లేదొకో ౧౦౦॥

వ. అనిననదియును. ౧౦౧॥

చ. పదపదయిట్టి యుక్తులను బల్కకు కొందఱు తెల్పఁ గొందఱిం
పొదవుచునంద్రు వల్పగుమనొక్కఁడు యోగ్యుఁడొక్కఁ డుండుగు
ర్మదుఁడయి యట్లు ధర్మములు మాఱుట తప్పొకొ యుక్తు లేలనీ
సదనముఁ జెందుపొమ్మనిఁ జయ్యన నాతఁడు పోయె నంటికిన్ ౧౦౨॥

గీ. పోయి యాతఁడు పదిరెండుప్రొద్దులాత్త కట్టగాఁ బట్టి వెడలించి యొట్టకేని
పడపు చెలియింటికేగుచోఁ బాదయుగముఁ బట్టి కన్నీరు విడమచుఁ బలికె లక్ష్మి ౧౦౩॥

## లక్ష్మి కేశవరావును చేఁగొని నీతిచెప్పిన బెత్తముతోఁ గొట్టుట.

చ. నిముసము కోపగించకుఁడు నేనొకవిన్నపమాచరింతున
క్రమమిది మాస మేని యొనగాదు మహాత్తరులైన తండ్రిగా
రమరుల వీఁటికిం జని రిపోర్ధునదీక్ష యొనర్చువారు స్వ
ప్రమదను గూడ కుందురఁట వారవధూటుల పొందు యుక్తమే ౧౦౪॥

ఆ. పెద్దలున్న యపుడు పిన్నవారలు మీరు వారలిపుడు దూరమైరి గాన
నింటి కాధ్యులౌట హెచ్చైనకీర్తులఁ బడయవలయు జన్మఫలము గాదె ౧౦౫॥

క. అనదండతాడితంబగు ఘనతరకాలాహిపగిదిఁ గనలుచు సాధ్విం
గనుఁగొని నాకడనీ వేపెనుదీయక ధర్మములను వినుపింతువహో ౧౦౬॥

చ. వెఱపొకయింత లేక పదవిన్నను నడ్డము దాకి ధర్మముల్
గఱపు మఁ బ్రేలసాఁగితివి కాపొకొ పైదలి నం మదంతముల్
గొలుకు మనాకు నిట్టిపలుకుల్ గొఱగావని తూలఁ బల్కుచుం
జులుచులఁ జూచి బెత్తమునఁ జుట్టున వీపు వైచె నా సతిన్ ౧౦౭॥

వ. ఇట్లు వైచిన శివశివాయని మఱలి యత్తకయినం జెప్పక గృహంబునందుండి భర్త
కుంబూర్వరీతి శుశ్రూషఁ జేయుచుండె నాతండు గడకత్తెయింటికిం బోయి దా

నీయడిగిన సొమ్ములెల్ల నిర్నిరోధంబుగ నిచ్చుచుం దవేకాయత్తచిత్తుండై యుం
డుఁగత ౧౦౮॥

ఉ. చెంగటి వేశ్యకల్లవిటశేఖరుఁ డిచ్చెనఁ బ్రేమమీఱ ని
న్నంగన గొమ్మటంచు ముసబ వారసు చీరయొకండు దెచ్చి వా
రాంగన యెట్టులుం దెనని యాఁగడ లెస్స యటంచు తద్దనం
గొంగునఁ గొట్టి తీర్చి తివిశోరకసంచు ధరంబు వంచుచున్ ౧౦౯॥

క. నీపాటి నాకొమెఱుఁగుదు నోపిన వెలఁజెప్పుమనుట నొకవందపయిన్
రూపాయ లేఁబదియనఁగ నోపుదు నే నియ్యటంచు యుక్తులు సెప్పన్ ౧౧౦॥

గీ. అనినఁ గయింత గీర్వాణమాడనేల గావలయునట్టిదని తెల్పఁ గావలవదె
యనుచు నమ్ముద్రితప్పక యనువు మీఱ చీరఁగొని తెచ్చియిచ్చె సింగారవతికి ౧౧౧॥

సీ. ఒకనాఁడు తీర్థంబునకుఁ బంపవేయనఁ బాయక నూఱురూపాయ లిచ్చుఁ
బండుగ వచ్చె నెబ్బంగి సాగునటన్న బాయక నూఱురూపాయ లిచ్చుఁ
బంధుగృహంబునఁ బరిణయంబని చెప్పఁ బాయక నూఱురూపాయ లిచ్చుఁ
బ్రొమొక్కు కొంటి మిస్వామికొక్కనాఁడని పల్కఁ బాయక నూఱురూపాయ లిచ్చుఁ

గీ. అవికలకునంము జెవికెంపు లౌలకంచు నత్తరులకంచు మొత్తనిమొత్తకనుచు
దిండులకనంచుఁ బన్నీరుగిండికనుచు వానిసొమ్మెల్లఁ రాఁబట్టె వారవనిత ౧౧౨॥

క. కనకాంగి కాముకునితో ననుకూలత నొక్కగేహమందుండఁగ బ్ర
క్కనె యంగణంబునందు జ్జననియుఁ బ్రస్తావనావశంబున నంతన్ ౧౧౩॥

## పాప కేశవరావు వినుటట్టితర వారకాంతల యౌన్నత్యమొక.

## నేస్తకత్తెతోఁ జెప్పుట.

గీ. కేశవునివీమలందు సోకింపఁదలఁచి పాత్రివేశినితో విట్టు పల్కఁ సాఁగె
నప్పుడా చితెకలవాణి యొప్పులెల్ల మొన్న మొన్న టికన్నదిరొను న్ని నేర్చె ౧౧౪॥

శా. దాసింబ్లీడరుగారో కావొకరుచేతం బట్టి రావేరుస్తే
మో నానాటను దీపబూచినక్రియన్ ముత్యాలరత్నాలసిం
హా నానావిధ భూషణంబులను దేహంబెల్ల నిండె న్నమీ
దీనారంబులు పెట్టె గాదియది ఖ్యాతిం జెందెఁ దీవ్వేఁటిలోన్ ౧౧౫॥

చ. చదువుల నెంత నేర్చిననుజక్కఁదనంబది యెంతగల్గినన్
మొదటను వారనారులకు ముఖ్యము గాఁ జతురత్వమున్నచోఁ
దుదకు దృష్టమా పయనిఁ దోడగునంతటి పాత్రిధిమంబులే
మదవతికబ్బె నెంతపలుమాసి సినైనను వంచునింతలోన్ ౧౧౬॥

క. అక్కరొ దానికిఁ గల్గిన చక్కఁదనం బెంత దాని సౌరెంత టిదా
వొక్క పరిజాపిదానికి మిక్కిలి రొక్కంబు లీక మిగులునె యొవఁడన్ ౧౧౭॥

సీ. ఇట్టివచ్చినయట్టియింజనీయరొకండు మేలైనయద్దాలమేడఁ గట్టె
నున్నట్టులుండంగనొకవరుసీయరు పేరైనకాసులపేరులిచ్చె
నిన్న మొన్న నువచ్చియున్న యాకాంటరు బాగావారసుబట్టలిచ్చె
సరసంబునొక తూరిసల్పి నాజరుగారు పదియొంగరంబులుగొదుకకిచ్చె
గీ. గడనకత్తెయనంగనప్పుడఁతిగాక యున్నవారల పేరేమియూరు నేమి
యింతటిదిగాక యున్న చాందంటియొకతె పల్లవమొకర్తుమిక్కిలి ప్రౌఢసుమ్ము॥ ౧౧౮॥
క. నాకుంగలదొకతనయవివేకమునొక యింతయైన వెలువుగలదిగా
దేకరణి బ్రదుకనేర్చునొ నాకాలంబెల్లఁగడపి వానొయ్యెలుఁగవే ౧౧౯॥
ఉ. మంచిగుణంబునంబలుకు మానిసికేశవరావు తన్నుఁ గా
మించెనుగాన వానిమదికెక్కుచు నొసరసంబులంగ లం
గించియనుగ్రహంబతనికింగలిగించినమందు వెన్కలం
గాంచెడువాఁడుగాఁడుతన కాంక్షితముల్ సమకూర్పకుండునే ౧౨౦॥
మ. అనవామాటలు వీనులందవులఁగా నాకేశవుండాత్మలో
ననుమానించుచు వీరికెన్నఁడును నేనన్యాయముం జేయ మం
టినె ద్రవ్యంబునుగోరినంతయును రెట్టింపుల్ సమర్పించుచుం
టినిగా దేయికవీరికిం దనివి బుట్టింపంగ నాశక్యమే ౧౨౧॥
సీ. అబ్జముఖుండ్లగుంపావరించినయట్లు పనసపంటికిఁ జర్మమూసినట్లు
రత్నంబుపైఁ బొరబారికొనవిధమున ముత్తెంబుపైగబ్బువాత్తినట్లు
లేంకాయపైఁ బెమ్మొలంకెంచియున్నట్టు నీట శైవాలంబు నించినట్లు
కస్తూరిపైఁ దిత్తిగప్పినపోలిక మత్తపై భూతంబుమత్తిగినట్లు
గీ. వారకామినియనుభోగ్యవస్తువులను వృద్ధమాతయనందగు పెద్దపిడుగు
నిచ్చలును గాచియుండంగ హెచ్చుబూను నొకడెకాంద్రదకు వేడ్క చేకూరఁగలదె॥ ౧౨౨॥
క. కోదువయొసంగితిభూషలు సదనమునంగల్గువస్తుచయమమ్మితినా
సుదతి నంగళసూత్రము నుదగ్రాంగలతో డవులెల్లదోఁచియొసఁగితిన్ ౧౨౩॥
శా. కోశంబెల్లను వీరికిచ్చితిని సంకోచంబులేకుండ నా
కాశంబంతటి నోరుపాపితుడకుం గైఁబడ్డవన్నింగఁ గా
నాశఁ జెందుచునుండెనిప్పటి యుపాయంబెద్దియో సర్వమున్
నాశంబందినఁ జెచ్చెలిస్వ్వడుట వాణ్ణిత్యాగమైతోఁ చెడున్ ౧౨౪॥
ఆ. అదియుఁ గాక తనకుఁ బదిలక్షలబ్బిన నన్నెనమ్మియుండెనన్న తొంగి
దీనివిడుపుకన్న ప్రాణంబు విడుమట మంచికార్యమనుచు మదిని దోఁచు ౧౨౫॥
క. కాకున్న సతియొకవింజేకొన్నందీసకెంతసిరియబ్బునొకో
నాకన్నఁగరిను డెవ్వం డీకన్నెవ్వసువాసంగకేమచునుంటిన్ ౧౨౬॥
వ. అని యిట్లు తలపోయుచు నత్తరుణుండు తన యింటంగల విత్తంబు తగ్గుటం జేసి
యింగిలీ గ్గినసంగతి వలన నప్పుడు పుచేసియలవుండనయందు గౌరవంబు తగ్గుచుండెను

### శాలినీవృత్తము.

శ్రీగౌరీసంశుద్ధచిత్తాబ్జభృంగా వాగీశాదిధ్యేయభవ్యస్వరూపా
నాగేంద్రాస్యప్రీణనప్రేష్ఠచిత్తా నాగేంద్రాధీశభూషణవ్యాప్తదేహా ౧౩౮॥

గద్య-

ఇది శ్రీమన్మంత్రిప్రెగడవంశపయఃపారావార రాకాసుధాకర రాజబిరుదాంకిత భుజంగరాయామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్ర దుర్గామల్లికార్జునప్రసాదరాయవరపుత్త్ర శ్రీమార్కండేయ వరప్రసాదజనిత కవితాధౌరేయ బుధజనవిధేయ భుజంగరాయనామధేయ ప్రణీతంబైన వారకాంతయను చాటుప్రబంధంబు నందు ద్వితీయవిలాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

శ్రీమార్కండేయస్వామినేనమః.

---

# వారకాంత.

---

## చతుర్థవిలాసము.

క. శ్రీమార్కండేయేశ్వర వ్యోమాశుగవహ్నిశంబరోర్వీదినరా
ట్సోమయజమానమూర్తిధీసజ్జనవినుత దేవదేవమహేశా ౧॥

గీ. అవధరింపుము పైకథ హర్షమెసఁగ రామదాససుతుండిటు కామవృత్తిఁ
దనదుసర్వస్వముమభోగవనితపరముఁ జేసి సంప్రీతికై గాసిఁ జెందుచుండ ౨॥

ఉ. ఇంగితచేష్టలం గని మనీషితుఁడుం బటుబుద్ధిశాలియౌ
సంగడికాఁ డొకండు డెందజాలి జనింపఁగ వానికిట్లనున్
భంగము రాక యుండఁగ నుపాయము జెప్పెదనో యి మిత్రమా
వెంగలివై ముమించినది వేమరుఁ ద్రవ్వఁగఁ బోకు మెప్పుడున్ ౩॥

ఉ. చేసినదేమొ చేసితది చెల్లుఁగఁ జేయు మనిప్పు డైవసా
దోసపుతొత్తుపైని మదిదొర్లఁగ నీయక వారు పల్కులం
బూసను గ్రుచ్చినట్లు మది బోఁదికె నేరము నీకు నీపయిన్
వాసియువన్నెయుం గలుగు బాంధుజనంబులు మెత్తురెంతయున్ ౪॥

శా. ప్యాసైయుంటివి రెండుమూఁడగు పరీక్షాంశంబులన్ బుద్ధియుం
భాషింపన్ విశదంబుగా మిగుల సంభావింతు రధ్యాపకుల్
వాసిన్ విస్తృత గౌరవంబు వడ్రుఘా వ్యాపారముల్లా నియా
యాసంబుం బడఁబోక నొక్క పనికై యత్నంబుఁ గావింపుమా ౫॥

క. ఆఁకటఁ గుందిరి తల్లియు వాకుల కాంతయును మిగుల వ్యాకులపడుచున్
నీకది శ్రేయంబగునే యేకరణి నోయింతయన్న మిడఁదగుఁ గాదే ౬॥

శా. అన్నం గేశవరావు నాహితుని పల్కాలించి చింతించి లో
నన్నాయన్న లిసాక్షి వీడు మనె వీఁడకార్యముఁ దక్కనే
మన్నం జేసెదదాని వీడిన యెడన్ వ్యాపారమింకేల నా
కన్నం బేటికిఁ జుట్ట లేటికిఁ దుదం బ్రాణంబు లింకేటికిన్ ౭॥

గీ. అయిన నీతని తోడ నొంగారవంగ నేల యట్లు చేసెదనని వీనిం బిమ్మటలఁ
జేయు పనిమాన వన్నేమి సేయునీతఁ డనుచు నుద్యోగవాంఛతో నతని కనియె ౮॥

మ. చనువుం జెన్ బలుపాళ్ళు నుండియు సిరస్తాదారుతో వాకుని
స్థానరంగా దరఖాస్తుఁ జేయనొక యుద్యోగంబు నీకుండునే
మును మాత్రం బడినిం జూచి గౌరవమునం బూజింతు మన్లొట నే
యనుమానంబొకయింత లేదు పని నా కైనట్లు గానమ్ముమీ ౯॥

క. ప్రస్తుతముఁ జూతువనుచున్ హస్తము గస్తులవానికిచ్చి ప్రణతిఁ గార్య
ప్రస్తావంఁ జేయంగ సిరస్తాదారుకడకేఁగి రయమునఁ బలికెన్ ౧౦॥

వ. అనంతరంబా సిరస్తాదారుండు వీని యవస్థం గటకటంబడి దైవగతి కబ్బురంబు నందుచుం బుణ్యవశంబున నిరువది రూపాయల నెలసంబళంబుగల యొక వ్యాపారం బవకాశంబగుటం జేసి యది కేశవరావునకిప్పించెం దదనంతరంబు ౧౧॥

చ. అదిమొదలా పనిన్ నిపుణుఁడై నెరవేర్చుచు వచ్చు సొమ్ముతోఁ
బదిలతనయింటి ఖర్చుకని పారఁగ వైచుచుఁ దల్లి చేతులోఁ
బదివెలయాలికిచ్చుచును వారలు దన్నును జాల్క సేయఁగా
వదలక దాసి యింటికని వచ్చుచుఁ బోవుచునుండె నిచ్చలున్ ౧౨॥

సీ. ఈ వేళ భద్రకంబెవరయు చునుండెనీ యిల్లాలు చెంతకు నేగుమనుచు
నీవిచ్చునీవికి నీనాటికింతయె చాలుఁ జాలును సరసంబులనుచు
వచ్చెను దప్పీన్గ వలెనంచు సణుఁగుచుఁ బెళపెళయనె నెటికలను విరుచు
నొక్కనితోఁ గూడియుండిన మాకింకఁ గడుపు నిండెటం చుఁ గసలు మండు॥

ఆ. నిన్నయే పగింపులెవరయు మనుండియు బానియిల్లు విడుతు నేనియింక
నిశ్చయముగ మేనవిల్లవు ప్రాణంబు లనుచు నెంచువాఁ డబ్బురంబు ౧౩॥

గీ. కేశవుని తల్లి మిగులదుఃఖించి యక్కట వీఁడు దుశ్శీలుఁడై ఇపుడు నవీడుకుం డై
నేమి సేయుదు మరలంగ హితముఁ జెప్పి చూతమని యెంచి మెల్లన సూనుఁ బిలచి ౧౪॥

క. నాచెప్పెడు పలుకులు తండ్రీ చక్కగ వినుము నీదు డెందము నెవ్వం
డో త్రిచెడఁ గొట్టిరిగద నే వాచవి చిననిట్టి చేష్ట వదలక యుండుక్ ౧౫॥

ఉ. ఇంటికి బెద్దవైతివి టులిచ్చఁ జరించుట నీకు ధర్మమే।
యింటిని గాని నేను మృతినొందిన దాన నెథర్త తోడ నీ।
కంటక మేల నీకుఁ బరకామినిఁ బొందుట మేలు గాదువు।
కన్ఁటికి నైన నీవ్రుశులఁ గాఁచక యుంటి మెయొంద టొంఁదతేక్ ౧౬॥

క. అంతటి కాపురమంతయు నింతకుఁ దెచ్చితివి నిన్ను నేమన విధియే
పంతముఁ బట్టెనో మన పై సంతాపముఁ బొందె నేని చక్కంబడు నే ౧౭॥

చ. పడపుపోలంతు లెందతినిఁ బాడొనరించరు భూమి నెవ్వరుం
జెడినను వాండ్ర కేమి పలుచిక్కులఁ బెట్టుచు మాయలాడుచుం
గడనయొనర్చుచుం డెదరు గాకి కనొప్పిరియెయొద్దు పుండు పెం
పడఁగిన వారి నెల్లఁ బడనా డెదరంతటి మానశీలునిక్ ౧౮॥

ఉ. మాయలు చేష్ట లెల్ల నెడమాటలు కర్మము లేదు సత్యముల్
తోయము లోని వ్రాతలగుఁ దోచ్చెపు మాటలు వారి సొమ్ములే
హేయపువృత్తి నైన థనస్సే గడియించ ఏటయందు దీక్షను
న్మాయద విందనేత్రలకు నగ్గము నై చెడకుండ రెవ్వరుక్ ౧౯॥

క. నామాట నమ్ము చక్కఁగ నీమదినూహించు కొనుము నిశ్చలవృత్తిం
గామించు వారిఁ జేరచుం బాములతోఁ జెలిమి వారభామల పొందుక్ ౨౦॥

గీ. అనిన నాపల్కులకు నుత్తరాడలేక శిరము నొక్కింత వంచుచు సిగ్గు గదురఁ
దక్కరు నిపోలెక్కఁ బొగముల్ ధరణియందు నల్లనల్లన జరుపు మువవలఁ జనియొ ౨౧॥

క. తల్లి వచించిన పలుకుల నల్లంబున మఱల మఱల నూహించి కడుక్
దల్లడపడుచుం జరిగిన చెల్లందల పోసికొందు నేకతము తేఁడుక్ ౨౨॥

మ. నను నారాయణశాస్త్రి యింతదశఁ జెందం జేసె నీకార్యముం
దుపపాయంబొనగూడుచుం చుమదిలోదో చెందుదం దానియా
వనమ్ము చక్కఁదనంబు నా వలపు లావణ్యపులా వాత్రిథిముం
బుమనన్నిట్లుగ మత్తుమందులక్రియుక్ మోసంబు నొందించదే ౨౩॥

సీ. ఒకనాఁడు వీణపాటకు మదిసొక్కించి చేలిరొక్కంబెల్లఁ జేరఁ దీసె
వివిధభోగంబుల వివశతనొందించి యొకనాఁడు సూర్యంబు నోడిసికొనియె
దరిఁ జొచ్చియొకనాఁడు పరిహాసమత్తత నుండ డంగ మురుగులనూడలాఁగె
వ్యజనంబు నొకనాఁడు హాయిగా విసరుచు మగరాల తమ్మెట్లు మాటికొనియె
గీ. నుత్తరీయంబు కొంగున నొక్కనాఁడు ముడిచియున్నట్టి కాసులు మోహపెట్టి
విడియమిచ్చుచు మెల్ల విప్పికొనియె నివియు [illegible] తోనొ తస్కర [illegible] త్తులానో ౨౪॥

శా. ఆమాణిక్యము లెందుఁ బోయెను [illegible] నీయుంబైన భూషాగణం
బేమైపోయెననర్ఘ్య వస్త్రవహం బెందుండెనో యక్కటా

యీ ముక్తాఫలహారము లిడిసెనెందా భూములేమయ్యెనో
యేమందు న్సకలంబు నిక్కముగ నా హేమాంగికిం జేరెనే ౨౫॥

మ. ఆకటా యెంతటి కల్లలాడితివి నా హస్తంబుతో నేను దా
నికి నేమిచ్చితినంతె కాక మన యింటం గొల్లగా దోచె నే
ప్రకటంబొప్పగ మత్పిత్ర్యాణములకు న్వాలయ్యె మువ్వంతుగ
న్సకలార్థంబుగ నిచ్చినన్ దొరకరా చంద్రాస్యకీడౌ సతుల్ ౨౬॥

క. ఏమైనం గానిమ్మా భామామణి విడతు నేనిఁ బాపము వచ్చున్
నామీదన్ మనసుంచుము నేమానిసినైనఁ గంటనీక్షింపదుగా ౨౭॥

గీ. మును పఁటి గౌరవము డిగెం గన కాంగికిఁ దల్లికేమి కారణమొకో
మన కున్వారికి భేదంబును గల్గునె గౌరవం పుహార లేమిటికిన్ ౨౮॥

వ. అదియునుం గాక ౨౯॥

ఉ. త్యాగము తగ్గుచున్న యెడఁ దగ్గక యుండునె వాని వెంబడిన్
రాగము చంచలాక్షికి ధరంబరిపాటియె గాదె యుట్టువ
ద్రాగమ వేళలందటి నులప్రతిరోధముగాఁగ వచ్చునా
భోగము గ్రీష్మకాలమునఁ బొల్పటిపోవక నిల్చియుండునే ౩౦॥

ఆ. తండ్రి డిన్నమ్మ మాన్పఁ దలఁచి యోపకపోయె నాఁడు దాని మాట యంతకన్న
నధిక మౌనె యింత యరయుంగ నేటికి వనియ ధాపురంబుగ నుజరించె ౩౧॥

క. అటులుండఁగ నగ్గణికా కుటిలాలకఁ జూచి తల్లి గొణుఁగుచు మనసెనీ
విటు సంసారిణివై తెనొక విటుతో నుండంగ బ్రతుక వెర వేమియగున్ ౩౨॥

## కవిరాజవిరాజితము.

కనఁబడెఁ గాయలు రాల్చిన మామిడి కైవడిఁ గేశవరావతఁడి
చ్చునె పరహోలను గోకలు మాడలు సొమ్ములు నేమని వానిపయిం
గొనకొని మక్కువ పీడకయుంటివి కోయనఁ గోటివిటుల్ గదయే
పునని తఁడంత దొకఁ డౌనటు గాదొకొ పుస్తెను గట్టెనె కంఠమునన్ ౩౩॥

సీ. పల్లవరాగంబు పలుగప్పఁగ నకున్న బల్లవరాగంబుఁ బడపునగునె
నీవినోదము లెల్ల నెరపక యుంటి వా నీవినోదము జేయు త్రోవగలదె
పలురూపు గాన్పింపఁ గిలకిల నగకున్నఁ బలురూపులను మాయఁ బరపు టెట్లు
తియ్యనిమాటలఁ దేల్చక యున్నచోఁ దీయనీవశమౌనె ధీరుమనసు

గీ. ఈపిటుల సేయకుండెదు నిందువదన యేవిటులు నిన్నుఁ జూతురు భావములర
గాన నమ్ముము నా మాట కాననమ్ము వెన్నెలవు గావు సుమ్ము నీ వెన్నెలవున

సీ. ఒకనితో మాటలనొప్పగా నాడుచు నొకనిని వేగలోనికినిఁ బిలిచి
యొకనితోఁ బరిహాసయుక్తులు సెప్పుచు నొకనికిఁ గనుసన్న యొనరఁ జేసి

యొకనికివీడెంబునొసఁగుననంతనొకనికిన్నవ్వుచు మొకముఁజూపి
యొకనితోఁబ్రాణనాయకుఁడవీవనిచెప్పియొకనిపైఁగోపంబుప్రకటపరచి
గీ. యొకనితోనిన్నువిడియుండనోర్వననుచునొకనికొక్కయుఁబూర్తిసేయకయొవారి
చేతఁగలరొక్కమంతయుఁజేరఁదీసి పంపదేనియునదియేటిపడఁపుపాలఁతి ౩౫॥
క. కొంతెతనంబులువెలశాల్గంటికిజన్మంబుతోడఁగల్గవలెంగా
కంటునెచెప్పినమాటలు మంటికినెవ్వండుసెప్పెమునపైవాఁడిన్ ౩౬॥
క. కావుననెవ్వనికాపుర మేవిధముసఁజెడినసంశయింపక వేవే
వేవేలుజేర్పఁగావలె వేవురువిటులకునాగిటుకువెట్టఁగవలయున్ ౩౭॥
వ. ఒక్కనాఁడు నీయందనురాగంబున డప్పూటికలెక్కరయియున్న నాయఁడుగారు వారంబంపియుండిరి నీవప్పుడు మేళంబునకుం గ్రామాంతరమం దుండుటంజేసి వారియుద్దేశంబు నెరవేరదయ్యెం గావున ౩౮॥
ఉ. ఆయతవిత్తవంతుఁడుయశోధికుఁడున్ కలాధికారియున్
నాయఁడుగారునీపయిఘనంబుగఁగామముగల్గివాతఁలం
బాయనివేడ్కఁబంపెనుసభాగ్యమిఁకేమనిచెప్పవచ్చునా
రాయణశాస్త్రినంపినరయంబునవచ్చునటంచుఁజెప్పినన్ ౩౯॥
క. ఆస్త్రీరత్నంబతనికి శాస్త్రింబిలువంగఁబంచిచాతుర్యమునన్
వస్త్రాదిభూషలన్ మరుశస్త్రంబనఁగన్నుగవకునమ్మదమొసగెన్ ౪౦॥
చ. జలజలలాడుపెన్నెరులసంపఁగినూనెమెఱుంగువెట్టిబల్
కలకలలాడుసోఁగయగుకన్గవఁగాటుకఁదీర్చినిద్దమై
మిలమిలలాడురంగుపనిమించెడుపావడగట్టిదానిపైఁ
దలతలలాడునొక్కజలతారుబనారసుపైటఁజేర్చఁగన్ ౪౧॥
క అయ్యింతిఁజూచునేమక నయ్యుద్యోగస్థుఁడధికహర్షంబునురం
బయ్యవిలుకాఁడుదరుమం జయ్యనఁజయ్యనననంగఁజూచుచునడచెన్ ౪౨॥
శా. ఈలీలంజనుదేరినాయఁడపుడాహేలావతింజూచుచున్
బాల్యారత్నముతోడనేవినయమున్ భాషించెనోదానిప్ర
శ్నాలాపంబులకేమియుత్తరముదానందిచ్చెనోదానితో
నేలీలన్విహరించెనోయెఱుఁగఁడాయెంజిత్రమానెంచఁగన్ ౪౩॥
మ. పవలుద్యోగపుకార్యముల్వడివడింబాటించినన్సారసైం
ధవముల్దంగతింజరింపనుచుందరిఁంచునాభామతో
నవహేలారతిమందమందకృతులన్వర్తించినన్ రేయితా
నవలీలంజనునంచునెంచునఁటనాయండద్భుతప్రక్రియన్ ౪౪॥
క. పలుమారునాయఁడీగతి లలనారత్నంబుతోవిలాసముసలుపన్
వెలవెలఁబారుచుమదిలో నలకేశవరావుచింతనందందొడఁగెన్ ౪౫॥

ఉ. అమ్మనఁ బాలు దాఁగి విడుదటమ్మన గ్రుద్దుదు రన్ని భంగులన్
నమ్మగ రాదు వారలల నామణులన్ మును దండ్రి చెప్పె మా
యమ్మయు నింతి బంధువులు నాప్తులుఁ జెప్పుచు నుండిరిన్నియున్
సమ్మతిఁ జేయ నైతి నవి సత్యము లైకన వచ్చె నీయెడన్ ౪౬॥

గీ. బ్రాహ్మణునిఁ గాని పొందన్ పలుకు వోయెఁ గులసతికి బోలె భర్త నాకును నొకండ
మనుమనుడువు లెల్లసున్న యయ్యెరు దలంప నిన్ను విడఁజాలననుమాట నీటఁగలసె ౪౭॥

క. అంతటి సంసారము నా కింతటికిన్ వచ్చె నీని సెంయుట చేనీ
చెంతకుఁ బోయిన వారిం బంతంబున నెవరు పట్టి పల్లార్చిరో ౪౮॥

చ. గతమున కీగతిన్ వగవఁ గార్యము గల్గునె నా కుదీని పై
మతివిడఁ గుండె నిప్పుడు నమానఁగఁ జాలను డీని పొందు నా
కితరవధూటు లప్సరసలే నియుఁ జిత్తమునందుఁ బట్టరా
చతురతయా విలాసములు నామృదురూపము నెందు గల్గునే ౪౯॥

ఉ. ఎంతటివారు గోరినను నెన్ని ధనంబుల నిచ్చిరేని యా
వంతయు వారి పై మనసంటి కూరిమి గల్గనేరద
కాంత కు నిశ్చయంబు ధన కాంక్ష మొయిన్ వివరించిఁ గాక త
త్స్వాంత మునన్నుఁ బాయదిఁక దానెవరించిన వాఁడనౌట చేన్ ౫౦॥

ఆ. నాయఁడుండె నేమి సన్నె మి శ్లాఘించెఁ గానదీని విడువఁ గాదు నాకు
నను మామనసుఁ ద్రిప్పి లో నియోగముగుండు వారకాంత వలప్రపంచదేవని ౫౧॥

క. నాయఁడు క్రమక్రమంబున లోయి చెలికిఁ గేశవునకు రూఢిగ నెపుడుం
బాయని తమకము గలదని చేయవలయు నేమటం మఁజింతి లెనుమదిన్ ౫౨॥

సీ. తప్పు లేకున్న నదడవియా ఫీసులోఁ బోసఁగ నిమాటల విసువు మండుఁ
గన కాంగి పొందు వద్దని పరోక్షంబుగాఁ బెర వారి చేతఁ జెప్పించు చుండు
లెస్స డిప్ప్యూటీక లెక్టరునిన్నుఁ గోపించు నేమని యసిపించు చుండుఁ
నడరి పాటునఁ ద్రోవ నెదురై విడువక ముఱుముఱు చూపులఁ జూచు చుండుఁ

గీ. గేశవుని మీఁద నాయుడుకినుకఁ బొడమి చేయగలచిక్కు లెల్లను జేయఁ సాగె
నేకఫలకాంక్ష గల్గిన వెంత వారి కైనఁ గలఁతలు బొడముట యద్భుతంబె ౫౩॥

చ. ప్రబలవిరోధమిట్లు రసఁ బైఁబడి యొన్ ధనహానిసంభవిం
చె బలగపుంజనుల్ దరిని సేయని రైన ను వీడఁ జాలఁడ
య్యబలను రామదాససుతుఁ డౌరపయోరుహసంభవుండు వా
రబిసరుహాక్షి మోవిమధురత్వము స్వీయుల మోవి నుంచఁడో ౫౪॥

చ. సరసపుపల్కులవ్వనితసల్పు చుఁ గేశవరావుతోడని
బ్బరముగనుండి యుండియు గుబాలున నాయుడుగారి నెన్నుచున్
వరగుణుఁ డచ్ఛరూపుఁ డని వర్ణనసేయుచు నాతఁ డిచ్చునం
బరములు సొమ్ములున్న గలుమాటికిఁ జూపుచు సంతసిల్లెడున్ ౫౫॥

ఉ. తోయరుహాస్య కేశవునితో విహరించు మనంతలోపలన్
హాయిగ నాతఁడున్న తఱి హాయిటకెవ్వరొ వచ్చుచుండిరా
నాయఁడుగారి మాటలు వినంబడె నల్లదె యూరకుండుమా
పాయుట్ల మేలు లేదిఁక యుపాయ మటంచును దిక్కులారయున్ ౫౬॥

గీ. ఆరసాభాస మేమని యనఁగవచ్చుఁ గేశవుం డంతలోపల గినుక భయము
సేవయును గిందులాడంగ భావమెఱియఁ జేయు పని లేక యిట్లని చింత సేయు ౫౭॥

చ. హరహర యేమి చెప్ప వెలయాండ్రు కృతఘ్నలు నేనొసంగునం
బరములయూరు పేరుటు సమానె నెసొమ్ము లడంగిపోయె నే
సరసవిహారముల్ మిగుల జప్పనివయ్యెనె నేటికీక లె
క్కరుసుగుణుండు దాతయును గావలసెంగద కాలమెట్టిదో ౫౮॥

ఉ. చక్కెర నోటయున్న తఱి స్వాదువు గానిక అంగియంతలో
గ్రక్కన మ్రింగినట్టి రుచిఁ గానఁగ వచ్చునె యట్టిరీతి నీ
కక్కసపుంబొలంతులకుఁ గామిత విత్తము లిచ్చునప్పడే
మక్కువ గాక యీగి యొకమాత్రము తగ్గిన మోముఁ జూతురే

మ. అని చింతింపఁగ నింగితంబెఱిఁగి వేశ్యామాత యున్ వేగ నా
తనితో నిట్లను నయ్య యీపనికి నైతెప్పిన్నఁ గాఁబోకుఁడీ
ఘనుఁడుద్యోగియటంచు నొప్పవలసెం గాకున్నఁ గోపించునో
యనసత్యంబని యెంచి బాలిశత బూర్వాకారుడై యుండఁగన్ ౬౦॥

క. వానిం దొలగించెదు వెఱ వానాయఁడు దలఁచి వీనికపకృతిఁ బోలెం
గానఁగ రాకుండంగా నేనొకటియొనర్తునను మనిశ్చితమతియై ౬౧॥

ఉ. ఈతరుణీలలామ నితఁడెన్నఁడు వీడక యుండె నద్దనన్
నీతియుఁ గాదు చేయఁగల నేర్పుల నెల్లను ముందు జేసితిన్
జీతపువృద్ధి పైనతనిఁ జేసెద ద్రాక్ స్మరు వేయుచోటికీ
భూతము దీనితో వదిలిపోవునటంచొనరించె నట్లు గాన్ ౬౨॥

## కేశవరావును బదిలీయొనర్చుట.

వ. అట్లా కేశవరావుం బదిలీయొనర్చిన నాతండును నాయండొనర్చిన కపటంబునకుం జింతించుచు నకటా ముందువచ్చిన చెవులకన్న వెనుకవచ్చిన కొమ్ములు వాఁడి యన్నగతి నీతండు నన్నుఁ దొలగించి కవఠాంగి నాక్రమించె నేయని చింతించుచు

ఉ. వర్ధన జాల వేతనము వర్ధిలుచుండఁగ వీఁడ జాలన
ముద్దియ నేమి సేతునెటఁ బోదునటంచొక కంట దుఃఖముం
దద్దయు నొక్కకంటను ముదంబిడి దానిని గౌఁగలించి యో
ముద్దులగుమ్మ నన్నరువఁ బోకుము నేనటఁ బోయి వచ్చెదన్ ౬౩॥

వ. అనవుడు. ౬౪॥

క. బుడిబుడిఁగన్నీ రేగతిఁ బొడమెనొ యనఁ బ్రియుఁడ వచ్చిపోదువు గాక
ప్పుడపుడటంచుం దద్ధన ముదుఁగక కొనుతలఁపుఁ గలిగి యొయ్యారం జెప్పెన్. ౧౬॥

చ. అతఁడును గొంతదవ్వుగలయన్నగరంబున కేగి యప్పనిం
జతురతఁ జేయుచుండి దివసంబులు మాటికి లెక్కఁ జూచుచుం
బ్రతిరవివాసరంబునను రైలుపయిం దగ వచ్చి యింతికై
యతిశయమైన వేతనములవ్వది రూప్యములిచ్చి నిచ్చ చేన్ ౧౭॥

ఆ. ఒంటిపాటిద్దుభుక్తియు సుభోగహీనత. భానువాసరమున వ్రతము సాకు
ననిక లెక్కసేయకుహద్దు చెప్పి పోలంతి కేశవాఖ్యుఁ గామకేళిఁ దేల్చు ౧౮॥

## కేశవరావు కనకాంగికి తనమీఁద ప్రేమగలదనుకొని సంతసించుట.

ఉ. నాపయిఁ గూర్మి చేసుదతిశాయని తోఁ గపటంబు సెప్పనం
జూపఁగ లేదు సంతసమహర్నిశమందు నయంబుఁ గూర్మి యౌ
నోపణమందుఁ గూర్మి యగునో వివరింపఁగఁ జాలఁ డయ్యె యా
న్నాపది మాత్రమిచ్చినపుడందిన గౌరవముం దలంపఁడో ౧౯॥

క. ఇటు సుందరి నాయని చెంగట మిక్కిలి ప్రేమఁ జెంది క్రమమున నతనిన్
మటుమాయలఁ బన్నుచుఁ దన పటమును ముడివేసికొనియెఁ బజ్జావతియై ౨౦॥

సీ. ఎంతశిక్షాపాత్రుఁడేని యేఁదనహితు నించుకలో విడిపించుచుండు
నెంత యనర్హవ కేనియు నుద్యోగంబు నించుకలోనఁ జెప్పించుచుండు
నెంతదుష్కరకార్యమేని లంచముఁ గొని యించుకలోనఁ జేయించుచుండు
నెంతమహాత్ముఁడేని యేఁదనవైరి నించుకలోఁ జణపించుచుండుఁ

గీ. బలువు రేయింతి నాశ్రయింపఁగఁ దొడఁగిరి కలికికి సుకనుసైగ జగజవడఁకిరి
చానచాతుర్యమగ్గింపసాగిరపుడు దానిభాగ్యంబు వర్ణింపఁదరమె శర్వ ౨౧॥

క. శ్రీ వెలఁదికి నెలజీతముఁ గావించెం గేశవాఖ్యు కరణిన్ సర్వం
బీ నేయనఁడది యధికం బీవేయనదతఁడు జెందఁడీ వేడుకయున్ ౨౨॥

క. ఈకరణి నుండ నచ్చట నాకేశవుఁ డాదివారమష్టమదినమం
దే కాకనడుమనడుమన్ రాకుండెని దేమియనుచు రగులుచునుండెన్ ౨౩॥

సీ. నీలముల్ శుద్ధశైవాలముల్వాడవిల్తు జాలముల్ముంగురుల్ఘాళిమంటఁ
జెండులై బంగరుగిండులై దానిమ్మ పండులై గుబ్బపాలిండులదరఁ
దూఁపులౌ మన్మథుపాఁపులో యెలదేఁటి రూపులోయనఁగ వాల్జూపులమరఁ
దారమై నిల్చు సింగారమై పూవిల్తు సారమై సుందరాకారమొప్ప

గీ. నడుగడుగునందుఁ దడఁబడి బెడఁగుఁ జూపఁ గిలకిల నునవ్వు మొలకలు వలపుఁ దెలుప
వచ్చియచ్చెలి మెచ్చుచు హెచ్చుగుచ్చి కౌఁగలించెడి భాగ్యంబుఁ గంటి నెపుడు ౨౪॥

క. చులుకమిలుకున్న మోవిం గొలుకఁగ నీకింత దురుసు గూడునె యనుచుం
గొలకొలలాడు మనంతనె మఱిమఱినను గౌఁగలించుమానిని నెంతున్ ౨౫॥

## కనకాంగిదలంచుకొని కేశవరావుచింతించుట.

సీ. ఆవేళఁ బూఁదోఁటయాలరుగాడ్పులు వీవ సౌధతలంబున సంచరించె
నానాఁడు మధురోక్తులాడుచు సరసను గుదురైనగదైపైఁ గూరుచుండె
నాపార్శ్వమునదలయంటినీరారంగఁ జెరలాడుచును సోగనెరులువిప్పె
నాసమయంబునవందంబుగా వీణ మీటుచు మగళీమున బాటఁ బాడె

గీ. అప్పుడీచర్య లెల్లనునమృతమయ్యె నిపుడు మదిలోనఁ బొడకట్టియేచుచుండె
విసము పోలికనేమియు వెరవుదోఁప దేమిసేయుదుఁ బ్రాణంబు లెట్టులిలచు ౭౬॥

క. నాభాగ్యము నాముల్లియు నాభవ్యతపఃఫలంబు నాపుణ్యంబున్
నాభూరిరాశియహహా శోభావతిపయసతండు చూఁడంగోనియెన్ ౭౭॥

గీ. ఉవిదతోఁ బొందు నాకు లేకుండె నేని గ్రాముమున నున్ననిత్యముఁగనులఁగాంతు
మోహమున నైచె వాఁడతికూర్ముఁ డగుచు నను చుదలఁ బోసి వెతగుందునను దినంబు ౭౮॥

సీ. సారంగ మోమత్తసారంగ మోకాదె యతివకుఁ జూపులు యానములును
మాకందమో శ్రీరమాకందమో కాక విమలాంగిపల్కులు వీనుగవయు
వాలంబులో ధేనువాలంబులో యకాచు చానకుఁ బెన్నెరుల్ జంఘులరయ
సరసములో తారాసరములో కావచ్చు నలినాక్షి బాహువుల్ నఖరములును

గీ. అనుచు వర్ణింపఁదగినట్టి హంసయాన స్వప్నమునవైన మనపంగఁ జాలకుంటి
నెవరితోఁ జెప్పకొనియెద నేమిసేతు సమయమును వేచియేచఁగ సాఁగెమరుఁడు ౭౯॥

క. ఇవ్విధముననొక వత్సర మవ్వనితకుఁ గుసుఁడు లాభమందు వసించెం
జివ్వన ద్వాదశరాశికి నవ్వరుసం జేరకుండు వాతలపోయన్ ౮౦॥

మ. ప్రకటంబొప్పఁగ భానువాసరమునన్ భర్మాంగిఁ బొందంగఁద
ప్పకయా కేశవరావు వచ్చునను మంబల్మాయి వాదంబుతో
నొకకర్ణేజపుఁడాప్తుఁడై తెలుపఁ గాహలం కారము జేసి నా
యకుఁడారాతిరి గద్దరించి పిలచెన్ ద్వారంబు చెంతం జెలిన్ ౮౧॥

## నాయకుఁడు రాగా కేశవరావును కనకాంగి తలుపుచాటున దాచుట.

క. పిలచినఁ గేశవుఁ డప్డొక తలుపువెనుక డాఁచి సరగ ద్వారముఁ దెరువన్
నలుప్రక్కలరసి నాయఁడు చెలువయతం డెవ్వఁడొక్కొ చెప్పుమటన్నన్ ౮౨॥

శా. ఆయ్యా యెన్నఁడు రానివాఁడితఁడు నేఁ డాదిత్యవారంబటం
చియ్యారం జెలికాంద్రఁ జూడ మటకున్ నైయే తెంచి మాయింటనూ
న్నెయ్యంబుండుటఁ జూచిపోవఁ దలఁచెన్ నేఁ డేవడింబోవునాఁ
డయ్యెం గావున రాత్రివచ్చెనఁగ నాతండుకోపంబునన్ ౮౩॥

చ. పటపటఁ బండ్లు దీటుచును భీమదినంబున నీకు సద్వ్రతం
బటయిదితో త్తదుష్టవెలయాంద్రఁకునీతియు జాతిఁగల్గు నే

యటులిటులాదరించితిఁగదా యది యంతయుఁ గాలిఁబోయె నే
పటు విభవంబుఁ గుక్కకిడఁ బైజనియా కులు నాకకుండు నే ౮౪॥

ఉ. బాఁపఁడ వంచు నీదు పనిఁ బట్టక యుంచితి నిన్ని నాళ్ళు మా
రాపలు గాక నీదగు మకాము విడన్ సెలవెవ్వఁ డిచ్చె నీ
క్షోపము లెల్ల నోరుచుట లాంగక యుంటి విమీరు స్వేచ్ఛగా
నీపయి నుండ వచ్చునన నింతియుఁ బాపయఁ బల్కు రంతటన్ ౮౫॥

గీ. తప్పొనరింపని దండన మెప్పగునె మీరు కోపము డుగుఁడు మీరె
తప్పు సహించనియెడ మే మెప్పగిది న్నిల్వవచ్చు నెంచుఁడటన్నన్ ౮౬॥

ఉ. జీతము వృద్ధిఁ జేసితినిఁ జేయఁగఁ గూడని తప్పు లెన్నియో
న్నో తలపోయకుంటి మపున్నది నేఁ జెడఁ జూతు నేనియున్
నాతరమే మఱల్చుటకు నాకును నీజనకుండు మిత్రుఁడం
చీతతి నోర్చియుంటి ననియె గనతండు స్వగేహసీమకున్ ౮౭॥

ఉ. అప్పురుషస్వభావుఁ డుదయామతిదూరముఁ జూచువాఁడునై
యప్పగిదిన్ సహించెనని యెంచఁగ వచ్చునె నిశ్చయంబుగా
నొప్పులకుప్పయైన తనికుం డెడురాగము వాని చిత్తముం
జప్పనఁ ద్రిప్పి నేర్పుగల సారథి దుష్టహయంబు నుంబలెన్ ౮౮॥

ఆ. అతివయందుఁ గల్గు ననురాగ మతనికిఁ బూర్వమార్గమున నె పొదలఁగాని
రాచకార్యములను రమణికిచ్చి గతి జేయఁడయ్యె మనసు చెదరకతన ౮౯॥

చ. అరఁగుల పైనిఁ గానబడ రాశ్రితులెవ్వరు లంచమిచ్చువాఁ
డరుదయి తోఁచుచుండె వినయంబున మాటపచించువారలున్
దొరకకయుండి రచ్చెలికిఁ దొత్తువకున్ శివమెత్తె నేనియుం
బరగఁగ మొక్కఁ దప్పదని పాటి యొనర్చిరి పూర్వమా క్రియన్ ౯౦॥

క. ఆతండో సఁగుచునుండెడు జీతము గాకొక్కఁగవ్వ చేతంబడమిన్
నాతికి నాయఁడు భారంబై తోఁచెం బయలరాక కడ్డం బగుటన్ ౯౧॥

ఉ. మానక యుండెఁ గేశవుఁడు మానిని యింటికి రాకపోకలన్
సానియు నాతని న్విడువఁజాలక యుండె ధనంబు పైరుచిం
బూనిన యట్టి పంచశరభూతముఁ ద్రోయఁగ నెట్టియాజ్ఞయున్
లేనిదినంబునం దురమణీమణి చెంతకు వచ్చియుండఁగన్ ౯౨॥

## నాయుడు కేశవరావునకు బత్తరపు వ్రాయుట.

ఉ. దైవవిధాన మెవ్వరికిఁ దప్పఁగ శక్యమె నాయఁ డంతలో
నే విధినో యవేళఁ జెలి యింటికి వచ్చి హఠాద్గతిం గనెం
దీవియఁ బోఁడిఁ గేశవునిఁ దెల్లము గానపు డెన్ని భంగులం
బోవు మటన్న నిల్వక గిరుక్కునమళ్ళె మహాగ్రహంబునన్ ౯౩॥

ఉ. చేతఁ గలంబుఁ గొంట యవశిష్టము గాఁగఁ దలంచి యప్పకా
రాతిరి వేళ బర్తరపు వ్రాసిన శాంతము గాక మున్నె య
త్యాతతవృత్తిఁ గేశవుఁ డకించిత దాదిగ నెన్నఁ డేని యుక్
కోఁతెఱవంగ నుంగొనుట రోఁతయటంచుఁ దలంచె నాత్మలోన్ ౯౪॥

గీ. నాటిసుదఁ గేశవుండును నాయకుండు నిడుచుచుండె మనుండవలుడిఁ గ గాన
బెట్టితో విత్తములు వ్యయపెట్టుటకును జేయిసాఁగక యుండె నెచ్చెలువకపుడు ౯౫॥

ఉ. ఆకొనియున్న యట్టిఁ రుఁ డంబలి యేనియుఁ గంజి యేనియుం
బాకము గాని దేనియలవడ్డ యెడం దినఁ గోరుపోల్కెఁ గా
నాకలకంఠి యుక్ వసు సమార్జన తృప్తి జనింపకుండుటం
గోకయొసంగు దానికినిఁ గోరికఁ దీర్చెఁ గ్రమక్రమంబునన్ ౯౬॥

క. హేమాంగిమణి నిద్దపు సామ్రాజ్యంజాతమను చుముచ్చట పడుతా
రాముద్దియ గృహమునకున్ వేమారున్ వచ్చిపోవు విటులైరహహా ౯౭॥

మ. సరజస్కంబున బుట్టినట్టి ఫలమా సారీమణీ వాక్సుధా
సరసీబిందుకణంబుఁ గర్ణముల నాస్వాదింప నా భాగ్యమున్
దొరకన్ ధన్యులమౌదుమంచు మదిలోఁ దూఁగాడు వారెల్లరుం
బరిహాసోక్తులఁ బెక్కునట్టి విలసత్ప్రావీణ్యులైరింతికిన్ ౯౮॥

మ. జనుపొప్పంగ నెకంటఁ గాం ముగ్నుమదిన్ సందిగ్ధులౌ వారలే
నడిగా వచ్చి సరోజనేత్రి కెదియో వాక్రువ్వఁ గాఁ దత్సా
నుడికిన్ మాఱ్మాడి నెంచి యెంచి నుడువ న్లాదుచున్ నవ్వుచున్
దడవన్ స్ఫోటనెయుండ సాఁగిరహహా తద్బుద్ధ చేతస్కులై ౯౯॥

సీ. ఎడకాండ్రు గావచ్చి గుడగుడ లాడుచు నతివతోఁ బరిహాసమాడువారు
ఘల్లుఘల్లుమనంగఁ గరమున రూప్యంబు లెగర వేయుచునుండు సొగసుకాండ్రు
ఒక్కనిద్రకు నెంతయుం కువరైనను నెన్నికిచ్చెదమను వన్నెకాండ్రు
తామరసాక్షిరో సామాటకేమిగ్గు త్తరమని పలుమరు దరచువారు

గీ. సంతసాటముగఁ గూడి యుంతి యింట వార్త్య తలమునఁ గొందఱు వంగణంబు
నందు గొందఱు నరుఁగులయందు గొంద ఱాకులంబుగ నుందురహర్నిశంబు ౧౦౦॥

క. ఆచాతుర్యం బేమన వాచాగమ్యంబు గాదు వచ్చెడి విటులం
దాచాముఁ బరస్పరంబుం గోచరముం బొందకుండఁ గొనసాగించున్ ౧౦౧॥

వ. అట్టియెడం గేశవుండు కోమలాంగిని విడువంజాలక యక్కటా యక్కుంబు తక్కు
వయయ్యె నిక్కాంతపయి మక్కువ యక్కర్ణిని పెక్కుచిక్కులఁ బెట్టుచుండె
వీండ్రు నన్నుం దృణంబునకన్న లఘుతరంబుగాఁ జూడం దొడంగిరి చెల్వయుఁ
బణ్యవీధిన మరించిన క్రొమ్మావిపండయ్యె నైనను దొల్లింటికై పడి వచ్చుచుం బోవు
చుండెదనని తలపోసి ౧౦౨॥

తనయింటికి కనకాంగికి గౌరవము తగ్గినను కేశవరావు విడువకుండుట.

క. ఒకనాఁడు తలుపుదీయక యొకనాఁడు గృహంబునందునుండిరి ఖలులం
జొకనాఁడు రేపురమ్మని కికురించఁగ సాగిరపుడు కేశవరావున్ ౧౦౩॥

క. అట్టియెడఁ గేశవాఖ్యుం డిట్టుమఁ బలుమాఱు పాపతీ వ్రామర్షం
బుట్టిపడ నాఁడెవిదెనా పట్టియకట నీవు నెంత పైపైకం డెక్ ౧౦౪॥

ఉ. నీ మఁడ యెన్ని సారులిటు నీకు వచించితి సిగ్గులేదె సం
కోచ మొకింత డెందమునఁ గుంజనియింప దెమాగృహంబునం
దాచఁగఁ బెట్టినావఁట రత్తాతల నాటిధనంబు సర్వమున్
నీ చెలిమింగదా యిటు మణింగెను మాధనలాభమంత యుఁక్ ౧౦౫॥

ఉ. కాసులు దెచ్చినావొ కనకంబులు దెచ్చితొ సంగినావొకో
వీసమునైన లేదు గద వెచ్చపుసానియొ కాదొ లేక నీ
కోసమె యుందునుం డెనొకొ కోంటివొ మాకనకాంగి దుర్మతీ
నీసరివారిఁ జూడ వెయ నేకధనంబుల నిచ్చుచుండరే ౧౦౬॥

సీ. మీపీఠసన్నిధి నీపాంసురమ్ములు సానికి రత్నభూషణములౌనె
మీమంత్రపుష్పముల్ మీపూజనమ్ములు గణికామణికి నేమి కనకమౌనె
మీమడిపల్వలు మీ సదాచారముల్ వారకాంతకు జరీబట్టలౌనె
మీయిచ్చుదక్షిణల్ మీయన్నదానముల్ జక్కఁగా వేశ్యకు రొక్కమౌనె
గీ. యీయఁగలగిన వేశ్యల నెనయవచ్చు నీయలేకున్న నవ్వులికేగవచ్చుఁ
బ్రార్థనయొనర్చి మిమ్మురమ్మందురె పదపదగదయ్య కబురులు పనికిరావు ౧౦౭॥

సీ. పైడిపువ్వులపూజఁ బఱగించుమనలేదు గురుతరరత్నముల్ గోరలేదు
నిలువుధనములు గలిగింపుమనలేదు లక్షలు దెమ్మని లాగలేదు
గ్రామంబులిమ్మని ప్రార్థించఁగాలేదు భూములిమ్మనుచును బోరలేదు
వెలలేని తొడవులు వేకుటయును లేదు మొహరీలు దెమ్మని మూల్గలేదు
గీ. యిచ్చితివొ లేదొ మాకనొక్కింత సొమ్ము మిగులనొసఁగిన పోలిక నెగసిపడెద
వెల్లవారలఁ జూపె వేయిల్లునిండ విత్తరాసులుఁ బోతురు వేశ్యలకును ౧౦౮॥

సీ. పొమ్మని పలుమాఱు పోరి చెప్పినఁ గాని యీడిగెల్లంబ డెదింటి పంచ
వద్దువద్దని చెప్ప వాకిటిజేయరగు పైఁ బవ్వళింపు చెద్దనంబుల బల్కుదవుర
తెలుపుఁదీయనటంచుఁ దెలిపినఁ బోవక బ్రతిమాలుకొందువు పలుతెఱంగుల
సమయంబు గాదని చక్కఁగాఁ జెప్పిన దొడదొడలోనికే దూఱుచుందు
గీ. పౌరని న్నెన్ని కంకిన నోరునొప్పి నీరమణి నెవ్వరికినైన దారవోసి
వచ్చితివె వేఱుగతిలేక వారకాంత పొందు నీబోటివానికిఁ బోసగునటర ౧౦౯॥

గీ. అప్పుడప్పుడు మాయొద్ద నప్పుగొంటి వేయువందలు వడ్డితో నెంతయగునొ
యిల్లు వాకిలి యెూఖమ్మియియ్యవేని యట్టిపత్రము నీపనిఁ బట్టుకున్న ౧౧౦॥

గీ. అట్లుబల్కుచునుండ హేమాంగి వచ్చి తల్లిపైఁ గద్దరించుచు మదగవరివలెఁ
పోటిసేయకుఁడీవృథామాటలనుచుఁ గొంటెతనమున నాతని నింటికి నిచె ౧౧౧॥

శా. ఆ రామామణి తల్లి కేశవునకుం బ్రారంభమందుల్లస
న్నీరంబై కరకంబునై హిమఘనస్తోమంబునై మౌక్తికా
కారంబై శశికాంతమై స్ఫటికమై క్రమంబైన వజ్రంబునై
ధారాళంబుగ వానిమీఁదనుతుదం దర్శింపనావాటికిన్ ౧౧౨॥

వ. అతండు నిజగేహంబున కరిగి యొక్క వేదికపై నుత్తరీయ చేలంబుం బరచి పవళించి భూతావిష్టుని తెఱంగున సొమ్ముపోయిన వానిపగిది బ్రహ్మహత్యఁ జేసినవానికైవడి రాజదండనంబున కలనడిన వానిచాడ్పున వృశ్చికదష్టుని విధమున నేమియుం దోఁచక యిట్లు చింతింపదొడంగె ౧౧౩॥

## కేశవరావు తనహీనదశకుఁ జింతించుట.

ఉ. అందఱు నన్ని చెప్ప విననైతిని మున్నొకయప్పుడైన నీ
కొందలమందనాకిపుడు కూడు నెనీరము లెల్లఁ బోవఁగాఁ
దొందరఁ జెంది సేతువిడుదు మఱితినైతిని చెప్పవారలే
పందలు గాక చెప్పుటను వచ్చెద రేనను బోటిమూర్ఖునితోన్ ౧౧౪॥

ఉ. కేశవరావుగారనుచు ఖేలనమాడిరి పిండుప్రియున్నగాఁ
గేశవరావటంచు మతిఁ గేలుచుఁ బల్కిరి కొన్నివాళ్ళకుం
గేశవుఁడంచు నాపయి నికేరడమాడిరి నాఁడు నాటికిం
గేశమటంచు నన్నిరి కేవలవిత్తకృశత్వరీతిచేన్ ౧౧౫॥

ఉ. ప్రత్యహమింత సొమ్ము తనపాణితలంబునఁ బెట్టకున్నవై
యాత్యముఁ జూపి ద్వారమునకడ్డము దాఁకుచు నెన్ని చెప్పినన్
వ్యత్యయవాక్యముల్వలికియవ్వలికంపుచుఁ బాపిముండపా
డాత్యయమాచరించు వెలయాండ్రరతుల్ నరకంబు లెంచఁగన్ ౧౧౬॥

శా. హాలాపానవిలోలచేష్టుఁడగు మూర్ఖాగ్రేసరన్మేమ్ముఁడా
బాలన్ శుల్కముఁ బూనినన్ని టులఁ ద్రిప్పం బాడియే యెంత యో
కాలంబయ్యె నటంచు లోఁ జనిబలాత్కారంబునం బట్టియున్
ద్వేలప్రక్రియనిచ్చదీరనడఁచెన్ వేణీసమాకృష్టిచేన్ ౧౧౭॥

సీ. సౌరనారులతీరు నారఁ జేయుచు మీఱు సౌరుతో బ్రాహ్మణజారుతోడ
హెచ్చియచ్చరమేలి మచ్చికంటులఁ ద్రచ్చుతీరుతో క్షత్రియవీరుతోడ
నిక్కుజక్కులతళుక్కుచెక్కుకళుకులఁ ద్రొక్కు నీటుతో మేటికిరాటుతోడ
పాఁపపాపలకోపురూపుమాపఁగనోపు నేపుతో నొకగొప్పకాఁపుతోడ

గీ. చెలువుదళుకొత్తు బలుకొత్తసిరులతోడ నందటికి నన్నిరూపులై యమరనేర్పు
గలిగి మెలఁగెడునల వెలకలికి యోర దానిమాయలు దాని కేతగును మహిని ౧౧౮॥

సీ. పరవంచనాప్రీతిభాక్కులు వాక్కులు దుష్పథవర్తనధుర్యచర్య
అఘసంచయాలంబయష్టులు దృష్టులు బహ్వసత్యోక్తిసుప్రవహ్వజిహ్వ
సతతవిత్తార్జనరతములు మతములు సమ్మోహనవిధానసద్యవిద్య
తరుణజనాశయదాహముల్ దేహముల్ చిత్రచౌర్యవిధానశీలశీల
గీ. కామిజనమానసంహ్వాతిఘనము మనము వారనారీజనంబులకారయంగ
వీరి సృజియించునప్పుడ విశ్వకర్త యేగతిని నిల్చె వంచన లోఁగకుండ ౧౧౯ ॥
ఉ. నాలుగుజాలుజారులకు నల్లురికిన్ సమయంబుఁ జెప్పినన్
బాలిశుఁ డొక్కఁడాత్మమతిఁ బట్టఁగజాలక యింతి గూడన
వ్వేళకు మున్న గానియత వీనినిఁ ద్రోయఁదలంచి వచ్చినం
దాలిమిలేక యిర్వురును దైత్యులచాడ్పునఁ బోరి రుద్ధతిన్ ౧౨౦ ॥
సీ. ఒకని మంచముక్రింద నొకనిఁ గదాఁచి వేఱొకనితోఁ సరసోక్తులకుఁ గడంగు
వానిమూలకుఁ ద్రోచి ద్వారంబుచెంగటి మూవిసితోఁ గొన్నిమాటలాడు
వేఱొకఁడే తెంచి వెచ్చ మెక్కుడొసంగ వీనిని నొకతల్పు వెనుక నుంచు
వాఁడుకగలవాఁడు వచ్చుచో వీనినిఁ గిటికివెంబడి వాకిటికి ననుపు
గీ. వారలన్యోన్యము నెఱింగి వైరమూని దురము నొనరించి రతిఘోరతరముగాఁగఁ
దీరకుండెను నేఁటికి వారితగవు వారిలో నెవ్వొకండ నెయ్యారయరిది ౧౨౧ ॥
ఆ. కులము నషఁగఁబోదు తలఁపదు వృత్తిని వావిలేదు మూర్ధవంబుజూడ
దమలరూపమెంచ దర్థముఖ్యంబు పడఁతుచెలికిఁ గలదె పశువునకవు ౧౨౨ ॥
క. అంతటివానికిఁ బుట్టితి నింతటి దుర్వృత్తిఁ గలిగె నేమనికనా
కంతయుఁ జెడిపోయిననే డింతటనీ తెల్విగల్గె నేమిఫలంబో ౧౨౩ ॥
క. ఈయఱగు పైని మును పా రాయణశాస్త్రియును నేను నతిహర్షమునం
బాయక బాషించితిమిపు డీయారట మెంచవలెనని కాలగతుల్ ౧౨౪ ॥
క. అనియెంచుచు వారాంగన యనవీనులు మూసికొనుచు నాత్మగృహమునన్
జననికిఁ గులభామినికిం జనువుగ ననుకూలవృత్తిజరుపుచునుండెన్ ౧౨౫ ॥
క. దక్షాధ్వరశిక్షాపర యక్షాధిపబద్ధసఖ్యయైశ్వర్యనిధీ
యక్షాధిపగంధర్వా విక్షతకుసుమాస్త్రగర్వవినుతసుపర్వా ౧౨౬ ॥
క. చుక్కలఁ జేనిందలపై నెక్కించిన సోఁడవేల్పు సేటిసరమునం
జక్కనగుజడలవాఁడా ప్రక్కం జెలిఁ గల్గి-ట్టి విష్ణియకాఁడా ౧౨౭ ॥

## మదనదర్పణవృత్తము.

సామజరిపువాహనావిభాస మానమానసా ధీమహితవిశుద్ధమానిసాధితస్వరూపకా
నామజపనిరాకృతోరుబంధభక్తసంచయా హేమనగశరాసనంధితాహిసింజినీవరా

గద్య-

ఇది శ్రీమన్మంత్రిప్రెగడవంశపయఃపారావార రాకాసుధాకర రాజబిరుదాం
కిత భుజంగరాయామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్ర దుర్గామల్లికా
ర్జునప్రసాదరాయవరపుత్త్ర శ్రీమార్కండేయ వరప్రసాదజనిత
కవితాధౌరేయ బుధజనవిధేయ భుజంగరాయనామధే
య ప్రణీతంబైన వారకాంతయను చాటుప్రబం
ధంబు నందు చతుర్థవిలాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు.

శ్రీమార్కండేయస్వామినేనమః.

---

# వారకాంత.

---

## పంచమవిలాసము.

క. శ్రీనాథప్రియసుగుణని ధానా, రజతాద్రిసన్నిధానా, భక్తా
ధీనా, భుజంగభూషణ మానిజనావనవిధేయ, మార్కండేయా ౧॥

గీ. విన్నవించెదనైకథవినుమదేవ కేశవుండెల్లధనమాసుకేశిపాలు
జేసిదుర్వ్యథుఁడైక్లిష్టచిత్తుఁడగుచుఁ దల్లడిల్లఁగమెల్లనఁదల్లియనియె ౨॥

ఉ. ఏలవిచారమందెదవుదెవ్వరుచెప్పిననచ్చుదాయెనీ
లీలలనస్మదీయవిధిలేవడిజేయఁగనెలదప్పునో
బాలకయన్నహీనులయిపాత్రములన్విడువారలుండరే
మేలొనఁగూడకుండదుసుమీచిరమాయువుగల్గెనేనియున్ ౩॥

చ. వదలుముచింతవెండియునుబైడియుమోపుగనుండునంతసం
పదగలకొంపకిట్టివగపాటులుబొందగనయ్యొనక్కటా
చదరయగాకయుండునొకోచాపచినింగిననన్నవస్త్రముల్
కొదుకకగల్గుసంపదలకున్మునునోచనిదెట్లుగల్గెడున్ ౪॥

క. పసపునకైనీభార్యకు నొసఁగిరిపుట్టింటివారలొక్కింతమహిం
బొసఁగంబానందీనం గుసుమముగతిఁగాపురంబుఁగొనకొనినిల్పున్ ౫॥

శా. కైవారంబుగదోఁచునోపరులకుంగానిమ్మువాక్రుత్తుల
క్ష్మీవాణీగిరిజాసమానయగుచున్మెప్పొందునీభార్యనీ

భావంబిట్లుకలంగుచుండ మదిలోఁ బల్మాఱు చింతించిన
న్నీవాక్యంబులు చెప్పి పుచ్చె నదియే యెంచంగ శ్రీదేవి యో ౬॥

క. అడలునఁ గార్యంబొదవును పోడమును వోదంబు వలనఁ బుష్టి ధృవము గా
వడలంగ నేటికీగతిఁ దడబడఁగా నాటికొక్క దైవము లేదే ౭॥

ఆ. తల్లి లక్కయంట తనయులంటాలట యంతకరతినుఁ దైనయట్టి సుతుఁడు
గాఢతాపమందఁగ నుంగక యుండెనే వ్యర్థమానె లోకవాదమెంచు ౮॥

మ. అనినం గేశవరావు కొంత మదిధైర్యంబంది చింతించెహా
ననుదుష్టాత్ముని గాఁగ లోనెఱిఁగియున్ నాతల్లి యున్నీతిఁ జె
ప్పెను నా భార్యయు నిట్టి దుష్టుని పయిం బ్రీతిన్విడన్లేదు కా
ల్పనె నా జన్మము నట్టి యుత్తమ సతిం బల్వంతలం బెట్టితిన్

వ. ఇట్లు చింతించి మున్నొంటి దుర్మార్గంబునం బ్రవర్తించెనంత టిసన్మార్గంబునకు మరలి
సాంసారిక కృత్యంబుల నతిజాగరూకుండై ప్రవర్తించుచుండెనంత ౧౦॥

## పాపపత్త్రిమును బట్టుకొని కేశవరావు కడకు వచ్చుట.

ఉ. పాపయ నొక్కనాఁడతఁడు వ్రాసిన పత్త్రముఁ జేతఁగొంచు బల్
కోపపువృత్తిఁ గేశవుని పజ్జకు వచ్చి యతండు తన్నుఁ జూ
పోపమి గుండె జల్లుమన నోరమొగంబిడి చూడకున్నన
య్యాపరికించు దీని నిహప్తను నందిడఁబోవ నాతఁడున్ ౧౧॥

క. అది యేమి తెల్పుమనవుడు బదులునకీవిచ్చినట్టి పత్త్రంబనినన్
బదులెక్కడనే నెక్కడఁ బదపదపత్త్రంబదేడ పాపచరిత్రా ౧౨॥

వ. అనిన పాపయ ౧౩॥

శా. ఏలా యింత యసత్యమాడెదవు నీవిందొన పఖ్యాతికిం
బాలైపోదువు పత్త్రమీ వెఱుఁగవో పైపైని బోనియ్యనీ
వ్రాలే కాదొకొ సాక్షులుండిరి నినుం బల్కించెదం బోసనా
మ్మోలే కున్న నుబోదమధ్యమునఁ బోమ్మీతూటి ముమ్మాఱనన్ ౧౪॥

ఉ. చెల్లని మాట లేమిటికిఁ జెప్పెదవీ క్రియఁ బొమ్ము పొమ్ము నీ
వల్లభుఁ డంబుడీయుట యె వాస్తవమంచు వచింతు వేని నీ
ముల్లియ విప్పి యిచ్చితి వెముట్టెద వే గురు పాదపద్మమీ
యల్లరఁ జేయ నేల పదమా పదకుండిన బుద్ధిఁ జెప్పెదన్ ౧౫॥

క. పాపా చేయఁగడంగితి వీపేరున కుచితమైన కృత్యంబహహా
చీపో నా ప్రాంగణమున నేపని కైనిలచి యుంటివేదుష్ట యనన్ ౧౬॥

సీ. శంక యొకింత వీడి యనసాఁగిన చోమటి సాఁగిపోవునే
యింక ను పోవనీ పరువు నేకక నేఁ బదిమంది చెంగటం

ఙంకము వచ్చె నేనియును బాయుట దుష్కరకార్యమౌఁ జుమీ
బింకపుమాటలం బెనురు బెట్టినఁ బోవునె పాటసానియున్ ౧౮॥

ఉ. సానులఁ గూడి సుఖ్ఖుచును సౌఖ్యముఁ బొందినాఁ డెఱుంగవే
మానుదు దీనిశుల్కమని మాయొడ లూరక యమ్ముకొంటి మే
సానికి మేన్నుము ల్లెగద చక్కఁగ సొమ్మిడఁ జాలవేనియో
మానవిహీన చెల్లెలిని మక్కువతోఁ గవగూడకుంటివే ౧౯॥

## పాపతనకూఁతుఁ గొప్పతనముఁ జెప్పుట.

సీ. మాటాడె నేనియు మాడ మూల్యంబౌను సరగ వరాగదసర సమాడ
సరసను గూర్చున్న వరహాలు రెండౌను గొంగు దాకిన మూడిడంగ వలయుఁ
గరము చేఁబూనిన గాసు వెచ్చంబౌను గౌఁగలించిన రెండు కాసులౌను
ముద్దాడె నేనియు మోహరీ వెలయౌను వాతెఱచవిఁ జూచు వందయౌను

గీ. కూటమికిఁ నర్ఘ మీవలెఁ గోటియైన వారభామినియన్నఁ బైపైనిఁ గలదె
యిప్పుడు మగనాండ్రె వేశ్యలై యింటనింట సిద్ధముగనుండ్రు మాకూడు చెఱచుటకును

ఉ. ఇన్నియుఁ జెప్పినం బలుక వెంతటి కూళతనంబొ కానియా
పన్నత వచ్చు నేమిటికిఁ బాడయిపోదువటన్న నీకుది
కున్నకడన్ ఐచింపుమిట నుండక పొమ్మని కేశవుండనం
బెన్నడి వీధి నోర్వఁ గలఁడిఁ జేరిలుచుఁ బోయె నుబాయలక్కఁగన్ ౨౦॥

క. అమ్మయుఁ గొమ్మయు నకటా యిమ్మై యిఁ విడిపోవకుండె నిప్పటికి నిరే
ద్రిమ్మరియని పలుదెఱఁగుల యుమ్మలికల నాత్మ నొందుచుండఁగ నంతన్ ౨౧॥

క. సవయసులుం బ్రియవయసులున్ సవిధంబున కేగుదెంచి నర్మిలితోడన్
శివశివ యింతటి యంకిలి భవమునకుం దెచ్చె నెంతపాపమొ యనుచున్ ౨౨॥

ఆ. వృక్షమెల్లఁ గొట్టి వేళ్ళింధనములకుఁ గాఁగఁ బెల్లగించు కరణిఁ దోఁపఁ
గాఁపురంబు నెల్లఁగడ తేర్చియి వ్వేశ్య తడవ వచ్చె నౌర కడమది పుడు ౨౩॥

ఉ. ఏటికిఁ భత్త్రిమిచ్చి యిదియెన్నఁడు మాకడ నుచ్చరించవై
తోటమిలేక వ్యాజ్యమిడ నుంటివటంచును వాగిపోయె నా
చేటులమారి యంతపనిఁ జేయగ సందియ ముండదిప్పుడె
పాటమరల్పఁ గావశమె బ్రహ్మకునైన నదుష్టయాటచేన్ ౨౪॥

చ. మనసబు గారు జాణఁడును మూర్ఖుఁడుఁ గావున వారకామినీ
జనముల కార్యమన్న శిరసావహియించెడు నొక్కరాత్రియ
క్కనికిఁ యువానిఁ జూచి యరగంటకుఁ గార్యము నిర్వహింపదే
మనకును గోర్టకుం జనుటముం చిదఁటే వెలయాలి వెంబడిన్ ౨౫॥

క. ముం మోడుటయుఁ దిశ్యంబ్లైం టొనరించినఁ దప్పదింక నొనర నెకసా
ట్రినిదీర్పఁ నేయనిమ్మా మును జేసిన కార్యఫలము బొందక వశమే ౨౬॥

వ. అనిన నెద్దియుం బలుకక తలపంకించుచు నున్న రని యెద్దియుం దోఁచక కొంతతడ
వు చింతించి తన దుర్వృత్తంబునకు రోయుచు గడనపడం తుల దుశ్చేష్టితంబుల
దలఁచి యిట్లనియె. ౨౭॥

ఉ. చేసితి నెన్నియేని చెడుచేష్టల నేలగణింప వానిలోఁ
జేసితి నిద్దియు న్నిగులఁ జేసినదానికిఁ జింత యేల నా
వాసియు వన్నెయుం దఱిగె వాఁ డొక కేశవ తావు వీఁడు గాఁ
డా సమయంబునం బుడమి యాకసముం గనడాయె వాఁడహో ౨౮।

ఉ. కోకలటం బు మేల్ అవిక గుడ్డలటంచు విభూషణంబులం
చీకరణీ సమస్త వసువిక్కృపలం గని పట్టి మెల్లనం
గైకొని రేమి చెప్పనిది గాక శరీరము దుర్వ్యథాకులా
వ్యాకులమాటఁ గొంత వ్యయమయ్యెఁ జికిత్సక వేతనంబులన్ ౨౯॥

ఉ. ఈ లువుటాంద్రకన్నఁ గడు హెచ్చగు మాటలు చేష్టలెంచఁ బదు
శ్శీలములంతరంగముల శేష జనార్థ సమాహృతి క్రియా
లోలస దుష్టము ల్వెలపొలంతుల కుందు చితంబులెల్ల నీ
పోలికముద్దఁ జేసిన లుహోముల వేల్పు సృజించెనిమ్మహిన్ ౩౦॥

శా. విశ్వద్రోహిణులైన వీరి పొడయు న్వేశ్యా యలంద్రోచున
వ్విశ్వామిత్రు నిబుష్యశృంగుని దపస్వి న్విప్రనారాయణు
న్విశ్వాసంబున మోసపుచ్చిరొకొ యిత్వేయింటఁ బారాదులి
వ్విశ్వంబందుఁ దృణీకరింతురుగదా వీంద్రన్ మహాధైర్యులై ౩౧॥

## వేశ్యమాయమాటలతో విటులవలలో వైచికొనుట.

సీ. ఒకఁడిచ్చు విత్తంబుఁ గికరించి పుచ్చును వేఱొక విటునితో వేరమాడు
నొకనిని శేషత ప్పకరమ్మనుచుఁ జెప్పు నొకని పైఁ గోపంబుఁ బ్రకటపఱచు
నొకని లాలనఁ జేసి యొడుచును విత్తంబుఁ జేరిక నొక్కని గారవించు
ననురక్తి యొకనికిఁ గనఁ జేయు నొకనితోఁ బ్రాణంబు నీవని పలుకుచుండుఁ

గీ. జెడుగుకొంగలుఁ ద్రొక్కనమడుఁగు వేశ్య భోగముల పుట్టవిత్తముల్ ద్రోచు దిట్ట
భోగనారియనందగురోఁగనారి దానిఁ జూచిన నిహపరధర్మములఁగు ౩౨॥

గీ. వృద్ధరాక్షసి యొక్క తె గృహమువందు నుండి జారుల సొమ్మెల్ల నొడిచికొనఁగఁ
దానె అంగనిక్రియ పాపమూని యుండుఁ గనఁగొనగఁ జాలునెప్పుడు గణికమాయ॥

క. ఇప్పగిది గోశవాఖ్యుఁడు జెప్పఁగ వినియబ్బురంబు చిత్తములందుం
దెప్పరముగ వారుంజని రప్పాపని కేతనము వకరిగివడివడిన్ ౩౪॥

క. చని యంతయుఁ గనకాంగికి వినిపించిన నది యామిగుల వేరం బొప్పం
జను మిప్పు దెప్లీడరు కడ కనవుడు వెస నేగి యతని కన్నియెంగిసుకన్ ౩౫॥

ఉ. కృత్రిమవృత్తిఁ గల్గియల కేశవరావు మదీయపుత్త్రితోఁ
జిత్రవిహారముల్సలిపి చేతనొకింత ధనంబు లేక యా
పత్త్రము వ్రాసియిచ్చె నిది వడ్డితోఁ గూడిన వేయియయ్యె నే
మాత్రమెఱుంగ నం చనెడు మాటలు నమ్మకు గాన నీ యెడన్ ౩౬॥

## పాప కేశవరావుపై వ్యాజ్యము వేయుట.

మ. ఇది కంపెంటు సరించఁగా వలెఁ జూడీ యీ కార్యమీరీతిగాఁ
బదిలంబొప్పఁగఁ జేతులో మముఁ గృపాపారీణులై చూడుఁడీ
తుదకీ వ్యాజ్యము నిర్వహించు నొకఁ డేదో చక్కఁగాఁ జెప్పుఁడీ
చదురెక్కం జెడిపోవు కంటె మొదటం జాలించుటే మేలగున్ ౩౭॥
క. అనవినిప్లీడరు చీటిం గనితప్పక గెలచునిట్టి కార్యంబులు గో
టనుమీటితినె న్నేనియుఁ జనదుసుమీ పాపనీకు సందేహింపన్ ౩౮॥
గీ. దీనికేఁ బదిరూపాయలౌను ఫీజు బహుమతులు గెల్చెనేని యీ పైనిఁ గలవు
కార్యమెఱుఁగ నిదానవు గావు గానఁ జెప్ప నేటికి నని వవదించె వదియు ౩౯॥
మ. తమకున్నం దియు మంద నేమిటికి మీ తాత్పర్యరీతిన్సమ
స్తము మాటాడఁగ నాతనూజయిట కుం దావచ్చునీ రాత్రికిన్
మము మీవాండ్రనుగాఁ గఁ జూడుఁడనుకంపావృత్తిని క్కాగ్యము
న్నముహూర్తంబెటు పైసమస్తము యథేచ్ఛన్ మీకు సంధిల్లెడున్ ౪౦॥
ఉ. ఆజ్యహుతాగ్నిఁబోలె నిటులల్గుచుఁ బాపయుఁ జెప్పిపోయె సా
మ్రాజ్యము చేతికబ్బినక్రమంబున నాతఁడు సంతసింపుచున్
సజ్యశరాసమందు శరసంధియొనర్చి పోల్కెనూటిగా
వ్యాజ్యము వేసెఁ గేశవుగృహంబును ముంచదలంచి యంతటన్ ౪౧॥
శా. నీచస్వాంతము గల్గు పాపయుఁ గ్రియానిర్వాహసంసక్తి చే
వోచం ద్రావిన ప్లీడరున్ స్మవనబున్ యుక్తోక్తులం జెప్పుచున్
నీచాత్మద్యము మీఱలోఁ [illegible] తేనిం గార్యమానం చుదు
ర్వాచాబోధనమాచరించియని చెన్నారిం డ్లకుంబుత్త్రికన్ ౪౨॥
చ. అనిచినవద్దియేగి తనవ్యాజ్యపుసంగతు లెల్లమెల్లనం
గొనకొని చెప్పి వారియెద కుందగ రక్తిజనింపఁ జేసి మీ
యనుమతి చొప్పునన్నడతునంతయు మీరు స్వకార్యమట్లుగాఁ
గనుఁగొనుఁడే నుసైతము నుగానొకొ మీపరిచారికామణిన్ ౪౩॥
ఉ. అంగన మోముఁ జూచి మునియంతటివాఁడుని మేషమాత్రలో
లోఁగును బ్రౌఢరత్నానలవిలోలవిలోచనఁ జూచు సంతసం
బొప్పంగ డెజార ముఖ్యుఁడగు మున్సబు దానినిఁ బల్కరించుచో
వంగ మెఱుంగఁ జెట్టిపని యైనను నొనర్చుటయబ్బురంబొకో ౪౪॥

క. హాటకగాత్రీ నీకిం పేటికి సందేహ మంద నేగుమని నిరా
ఘాటముగఁ గేశవుఁ డనుఁ బోటీ సాంత్వించ నతఁడు నొగులాదవంగన్ ౪౫॥

గీ. కాకమానదు కానున్న కార్యమనుచు భారమెల్లను దైవంబుపైని వైచి
యూరకుండిన నధికారి తీఱ పప్పుడు జేసి జప్తున కార్డరు జేసె నంత ౪౬॥

## కేశవరావు ఇల్లు జప్తు చేయుట.

ఉ. దీప్తతరాధికారిక నిదేశముఁ బూని యమీను గేహమున్
జప్తొనరింపఁ దల్లియును జాయయుఁ గేశవరావు నార్తి సం
ప్రాప్తత నైనమా యిబులరా పిడిఁ బెట్టెద విప్పుడేనియున్
గుప్తి యొనర్పనుండుట కుఁ గొంపయు లేదని యేడ్చి రెంతయున్ ౪౭॥

క. వేలము వేయఁగా నిరు వేల వెలకుఁ దద్గృహంబు విక్రయ మొందెం
జేలావశేషులై య వ్వేళన్ మువ్వురును వారు వెడలి వగచుచున్ ౪౮॥

మ. ద్విసహస్రప్రమరౌప్యముద్రికలకు వేయప్పు దీరంగను
న్న సహస్రంబున రామదాసుసుతుఁ డుండన్ స్వోచితాగారము
న్బొసఁగంగాఁ గొని వృద్ధబాంధవులు నాప్తుల్ జెప్ప నాలోచనం
బసరం దుండెను దైవయోగమున కబ్బం బొందుచున్నెమ్మదిన్ ౪౯॥

ఉ. కాంతుఁడు వారకాంత పయిఁ గన్నిద నప్పుత దేకతానుఁడై
పంతము పట్టి తన్నుఁ బడ బాదియు నప్పుడు రిక్తహస్తుఁడై
చింతల గుందు నేఁడు నొకచిత్తములోఁ బరిచర్య సేయుచున్
స్వాంతము నందు మాయనిడఁ జాలదు తత్సతి యెంత సాధ్వియో ౫౦॥

చ. వివిధములైన భక్ష్యములు వేఁడుగ వేఁడుగ దా విగ్రమ్మఁ గా
జవులొనఁ గూర్చి చేసి నెలచానకుఁ జెల్లెలికం చొకప్పుడున్
సవతికి వంచొకప్పుడును జక్కనివవ్వ మొగంబు మీఱఁగాఁ
దవునిమతంబు చేసెతఁడె దైవమటంచు చెదనమ్మి పంపదే ౫౧॥

ఉ. ఎవ్వరు సేనిఁ గేశవుని హేయపుకృత్యముల గ్గడించుచున్
అవ్వలు చేయుచుండఁగ వినన్ వగ లౌటఁ బిన్నదకర్ణయౌ
దవ్వగ నేగు నేటికివ భావ్యవహారములమ్మ యూరయుం
చొవ్వనిమాటలాడుఁ బతియుక్తులఁ జెప్పనున వ్వనో రిమన్ ౫౨॥

## కేశవరావు భార్య సద్వర్తనము.

సీ. వేకువ లేచుచు విభుని పాదములకు నెరఁగక భువిఁ బాదమిడఁగఁ బోదు
ఆజ్ఞనివచ్చినం చన్నంబు పెట్టక మొనసి వేఱొక పని ముట్టఁబోదు
కోపించె నేఁడని గుజగుజలాడుచు నతని నెమ్మది చేయక వలఁ బోదు
వీధికేగునటంచు వెలిమడుంగులనీక కడి యెత్తియదియును గుడువఁ బోదు

గీ. విభుని వేడుకఁ దీర్చుటవలఁ దనుచిత మను మదచ్చేష్టలకొకింతయడ్డు సేయ
దేమి సెలవిచ్చునోయని యెదురుచూచు లక్ష్మిఁ దలపోయఁ బ్రత్యక్షలక్ష్మిగాదె ౫౩॥

క. కేశవరాయఁడు తనసతి పేశలవృత్తియును భక్తిపృథులగుణంబుల్
కౌశలము నెంచి యొకయెడ సౌశీల్యంబమర నెంచ సాగెన్ మదిలోన్ ౫౪॥

క. ప్రత్యయమునఁ దత్పాతివ్రత్యము కను నప్పవోలె రక్షించనిచో
సత్యంబుగ మామకదుష్కృత్యంబులు నన్ను బట్టి కెడపకయున్నే ౫౫॥

శా. కన్నుంగానక యెన్నియో దురితముల్ గావించితిన్ వానిలో
నిన్నాళ్ళిక సుఖింగుటుంబినిని గానే లంబ్రయత్నంబునం
బున్నెంబొక్కటి జేసియుంటి నెదియో యిన్నట్టునం దానిచే
నిన్నాళ్ళీగతి నుంటి దీనికయి యీ పుణ్యంబు నాకుండునే ౫౬॥

సీ. అన్నతో నైనను గొన్నిమాటలె కాని పలుభాషలాడంగఁ బోలుపడదు
ద్వారంబుఁ గైసేయఁ దలఁచియేమనుగునో యనడి విధిలో దృష్టినిడఁగఁ బోదు
నిదురింపు మనపుడే మిషమ్మళింపునో కాని యొకగడెపని లేక యూరకోనదు
అత్తగారికి నేమియుత్తరంబిచ్చునో యెలుగెత్తి పడవిఁ బలుక దెపుడు

గీ. ఏకతంబున నాతోడ నెంచుకంత చిఱునగవుఁ జూపుటయె కాని చెక్కుఁ దెఱచి
చివ్వనను నవ్వఁ గాఁబోదు చెలులతోడ నెంతయని చెప్పవచ్చు నాకాంతచర్య ౫౭॥

గీ. ఈ తెఱంగునఁ దలఁచుచు నాతఁడంత నొకజమీందారు ప్రాపున నుండి యతని
చెంత వింశతిరౌప్యముల్ జీతముగల మంచియుద్యోగమొకటిగావించుకొనియె ౫౮॥

వ. ఒక్కకాలంబున నాటబోటులచేష్టలు మనంబునాటఁ దన మిత్రవర్యులకిట్టి కొఱగామి
యెన్నఁడేని యలవడకుండ వారలఁ బిలచి యిట్లని చెప్పందొడంగె ౫౯॥

## కేశవరావు తనస్నేహితులకు నీతిగఱపుట.

ఉ. ఓ జనముఖ్యులార వినుఁ డొక్క హితంబున చింతు మీరలున్
యోజనఁ జేయవచ్చు నిఖిలోర్వినిఁ గల్గినజంతుకోటిలోఁ
బూజితుఁడౌ మనుష్యుఁడయి పుట్టినమాత్రన వారిలోపలం
బూజితుఁడౌ విమర్శమునఁ బొల్చు సుజ్ఞానముఁ గల్గెనేనియున్ ౬౦॥

గీ. ఇట్టి సుజ్ఞానవృక్షంబు నింద్రియగణ పారవశ్యకుఠారంబు వేరుతోడఁ
బోనడంచును గానఁ దద్భ్రారివృత్తి వశ్యుఁడగువానికంటెను బశువుగలదె ౬౧॥

క. పశువులును ఖరోగంబులఁ గృశియింపక యిచ్చనుండుఁ గేవల వేశ్యా
వశమున నుండెడునన్నర పశువే యీబాధలకును బాల్పడియుండున్ ౬౨॥

క. వారస్త్రీకందంబుల నీరోగలతన్ జనించి యెంతటి బలియౌ
పూరుషవృక్షము నేనియు వారంగాఁ బ్రాకి ప్రాకి యడఁగం ద్రొక్కున్ ౬౩॥

మ. కులశీలంబుల నెంచఁబోరు మతియుం గుంటంధకుండా మయా
కులుఁడు న్నత్తుఁడు రూపహీనుఁడు మహాఘోరాత్ముఁడంచు వే

శ్యలులోఁ బెంచుచు విత్తమిచ్చునతఁడే సర్వోత్తమాకారుఁడున్
వలరాజంతటివాఁడు మేటియును మన్నాభింతు రంతే నియున్ ౬౪॥

క. తెలియాంధ్రుడు విటుల చిత్తము వలలం జేర్చెదరు మంచివగలన్ మిగులం
గులకాంతాయుత మొకవెల లలనలు దుల గాదు సద్విలాసప్రౌఢిన్ ౬౫॥

శా. ఈదుర్వృత్తుల సంచరించెడు సదా హేయాత్ముఁడౌ మానవుం
డాదైన్యంబున నుండి సాంఘిక జనవ్యాపార సంరీతి సం
పాదించుం దుదకిద్ది దేశమునకున్ భంగంబుఁ గావించెడుం
గా దేయీ యది పెల్లగింపఁగ నశక్యంబయ్యె నానాటికిన్ ౬౬॥

ఉ. వింతజనించు నీపడుప్రవృత్తి ప్రధానముగాఁ జరించు ని
క్కాంతలు హిందుదేశమునఁ గానఁగ వచ్చెదరన్యదేశముల్
వంతము పట్టి చూడఁగ నుపట్టర దేమొకొ నిర్నిరోధమై
యింతటి దుష్టవృత్తి యిట నెప్పుడు బుట్టెనొ యేల పుట్టెనో ౬౭॥

ఉ. బింకము లెన్నియో పలుకు వీరులు వీరినిఁ జూచునంతలో
శంకయుఁ గొంకుఁ దోఁచియతి సాహసవృత్తిఁ జరింప వారి వ
త్సంకజ సేవఁ జేయుటకుఁ బాల్పడి తత్సభలన్ని రా
తంకముగాఁగ బూజ్యతను దాల్చుచునుందురదేమి చిత్రమో ౬౮॥

క. కులగురువులైనవారలు వెలిఁ బెట్టందలఁపరట్టి వృత్తులలోనన్
మెలఁగెడు దుష్టుల నేమనఁ దెలియంగా రాదు వారి తీర్పిటులౌనో ౬౯॥

క. జారత్వమునకుఁ జూడన గౌరవమొనఁగూడకుండెఁ గావునఁ దద్వృ
త్తారంభులయి చరించెడు వారస్త్రీలకును గారవంబులు వచ్చెన్ ౭౦॥

సీ. సర్వసత్కార్యాఘుర్ఘురములకిమ్మహీ వ్యభిచారమరయంగ నడ్డుకట్టు
దృఢతరమై యొప్పు దేహవృక్షమునకు జారత్వమరయంగ వేరుపురుగు
దంపతీసౌఖ్యముల్ దద్దయు విడఁదీయు విటవృత్తి యరయంగఁ బెట్టుమందు
స్వర్గలోకప్రాప్తి సరణికి నిజముగా వెలిచవియరయ బెబ్బులుల డొంక
గీ. ఇట్టి దుర్వృత్తి మున్నతి హేయమాట నృత్తగీతాదివిద్యలు నేర్చుచుండి
జనుల కానందమొసఁగూర్చు వనితలపుడు జారతావృత్తి సొమ్ముగా జరుపుచుండ్రు ౭౧॥

శా. సంగీతంబహిముఖ్య తుష్టికరమౌ సామాన్యమై యందుమ్రో
ద్వంగుల్ కంఠము లెత్తి పాడునెడ నయ్యానందమేమందు నీ
భంగిన్ భూరిరసజ్ఞచిత్తములకున్ వారాంగనల్ జాలతు
ష్టిం గావింపఁగఁ జేయఁగాఁబడిరి నేఁ జెప్పంగలన్నాటికిన్ ౭౨॥

క. తుదకిది లంజెటికమునకు మొదలై నానాటఁ బెంటఁగి మదురుట వలనన్
మదవతులది యే వృత్తిఁ గొదుకక చరియించుచుండ్రు ప్రకుంతితమతులై ౭౩॥

గీ. దేవదాసులటంచు దేవళముల నృత్తగీతాదివిద్యల నెఱపుటకును
మాన్యములొసంగియుం ద్రుసామాన్యముగను నిట్టిసంగతి మీరలు నెఱింగినదియె ౨౫॥

శా. వీరల్ వ్యంజకనృత్తగీతముఖసద్విద్యాళి నానాటికిన్
జారత్వంబునకంగ విద్యలుగ నాజన్మంబు మోసంబులం
బ్రారంభించెదరిట్టికీడు మనకుం బ్రాపించకుండంగఁ బల్
తీవ్రల్ చింతనఁ జేసి చేయఁగవలెన్ దిట్టంబు లెన్నేనియున్ ౨౬॥

ఉ. అందరుకొందఱాత్మదృఢమైనను మోసము రాదటంచు వా
రందఱు నింతికంటఁబడునంత సుధీరులె యౌదు రయ్యయో
కందములాకులంబువులు గాలియు మెక్కు మహర్షివర్యులున్
సుందరిగాలిసోకఁ బలుచోద్యము గానరు గంటకుండిరే ౨౭॥

శా. స్త్రీమోహంబున నిమోహమంచిరితపోజీర్ణాంగులైనట్టి వి
శ్వామిత్రాదులు నిష్టమృష్టరసముల్ భక్షించువారింద్రియ
గ్రామంబద్దునఁ జేసెఁ జేలునుగదా గ్రావంబు మున్నిట్టిలో
సామాన్యంబె యింద్రియంబులకడున్ సాధించు సత్వండెతున్ ౨౮॥

సీ. నవరత్ననిగళముల్ గణికలు వారికి మారంబు గాము న్న గాయు మండి
సంగీతమునకని సన్నిధికే తెంచి యభినయాసక్తి చేనరసియరసి
దాని సౌందర్యంబుఁ దగ విమర్శించుచుఁ దీరైన మోమున దృష్టినిలిపి
యించుక సంభాషణేచ్ఛ జనింపఁగఁ జాటుమాటుగఁ గొన్ని మాటలాడి

గీ. అంతకంతకుఁ దగుపరిహాసమాడి భోగలంపటుఁడై చెడిపోవుఁడుదను
నిట్టు నానాటఁ జెడినవారెందఱోని కాంచఁబడుదురుగదమనకన్నులకును ౨౯॥

క. పడుగులు మొదలగువారలు చెడఁజూతురు కులసతులను సిదము గానం
బడపుచెలులుంటలగ్గని వెడయుక్తులుకొంత వందివివరింతురెలన్ ౩౦॥

క. ఆ నాఁడు కాళిదాస శ్రీనాథాగులు మనిట్లుచేసిరి నేడున్
మానకతప్పానీద్దా మలు లోవగును చోగిపురుషులుం జేతురు గా ౩౧॥

క. అనికొందఱు శుక్రతుచెడు ననికొందఱు తెందు భార్యకందము లేదం
చునుగొందఱు వైద్యుఁడు సెప్పెనటంచుం గొందఱుఁ ద్రుపెడబుద్ధుల చేన్ ౩౨॥

గీ. బూటకంబులటంచును బుదిమంతు లిట్టియుక్తుల నెల్లను నెఱుఁగవచ్చు
నహహ యీరీతిదుశ్చేష్టలతిశయించ నఖిలదేశంబు చెడుటెంత యద్భుతంబు ౩౩॥

మ. తనకుం బూర్వులొసంగినట్టిధనముల్ దగంబులై పోవనిం
టను భార్యాదులుగుందు చుండఁగను బిడ్డల్ దీనులై యేడ్వఁ జ
య్యనమాతాపితృపోషితంబయిన దేహంబెల్లజీర్ణింపని
ష్ఫలంజేయుటయే మిలాభమగునో భావింపుఁడీ మిత్రముల్ ౩౪॥

గీ. కండకావరమానమే నుగాన లేక గురులయుపదేశములుద్రోఁచి నరసవిటులు
వేశ్యజవ్వనమంతయు విలుతమనుచుఁ దలలుప్రక్కలు గాఁ జేయఁదలఁతురకట ౩౫॥

ఘ్నవములుభోగములిన్నిరయు కారణముల్ గదకాలమారయ
స్వాధీనిఁజొచ్చు నిర్ఝరిణి వైఖరిఁ బోవుచు మళ్ళివచ్చునే ౯౭॥

క. తానొక్కఁడె జనియించెం దానొక్కఁడె పోవు మృతియుఁ దానొక్కండే
కానితనకొరుఁడు లేఁడేకఁ దానొక్కఁడె నిలిచియుండుఁ దత్త్వంబరయన్ ౯౮॥

క. అనియిట్లుగఁ దలపోయుచు జననియు భార్యయు సుతానుసకలహితమ్ము
లొనరించుచుండ సౌఖ్యంబునుండెన్ దేవదేవుఁ బొగడుచు మదిలోన్ ౯౯॥

క. హేలాపుర పాలాది క్ష్వేలా సుగుణాలవాల విస్మయలీలా
హేలాధృత హాలాహల మాలాయిత జహ్నుబాలమానితశీలా ౧౦౦

మత్తకోకిల. పౌరుహూతమణీవిశోణిశ్రేణిభాస్వదంగకరత్నని
స్ఫారనూపురసిస్తులశ్రుతిజాలఘూఘురపాదకా
శ్మీరసంభవరేణుభస్మవిశేషరేణువిభూషితా
సారకాంచనకంకణౌఘభుజంగరాజవిభూషణా ౧౦౧

గద్య-

ఇది శ్రీమన్మంత్రి ప్రెగడవంశ పయఃపారావార రాకాసుధాకర రాజబిరుదాంకిత భుజంగరాయామాత్య పౌత్ర హారితసగోత్ర పవిత్రదుర్గామల్లికార్జున ప్రసాదరాయవరపుత్ర శ్రీమార్కండేయవరప్రసాదజనిత కవితాధౌరేయ బుధజనవిధేయ భుజంగరాయనామధేయ ప్రణీతంబయిన వారకాంతయను చాటుప్రబంధంబునందు పంచమవిలాసము సర్వంబును సంపూర్ణము.

# "వారకాంత" ను గురించి పండితకవులొసఁగిన అభిప్రాయములు.

---

మహారాజశ్రీ శ్రీరాజా భుజంగరావు బహద్దరువారిసన్నిధికి-

వేదము వేంకటరాయశాస్త్రి విజ్ఞాపించుట. తమ "వారకాంతం" చదివితిని. గ్రంథము చదువ వినుపుగాను లలితముగాను ఉన్నది. అలంకారములు సమయసందర్భోచితములుగాను సుబోధములుగాను మనోహరములుగాను ఉన్నవి. అక్కడక్కడఁ ప్రయోగింపఁబడిన సామెతలు ప్రాచీనములేమి నవీనములేమి హృదయంగమములై చక్కఁగనమరియున్నవి. గ్రంథమందు ఆంధ్ర గీర్వాణ భాషా పాండిత్యము గన్పట్టుచున్నది. ఇందలిపరిహాసోక్తులను ఇది యెఱుఁగని వ్రాయుచున్నాఁడ. ఈగ్రంథము ఏనీతిని బోధింప వ్రాయఁబడినదో ఆనీతిని బోధించుటకు, అనఁగా వారకాంత మాకీకరణీయయని తెలుపుటకుఁ గరము దక్షమయి మించుచున్నది. అతిశయోక్త్యత్యుక్తిప్రధానముగాక ఆధునికము స్వభావోక్తిప్రదర్శకంబగుటచే ఇట్టియాదక్షత కలిగినదని యెన్నఁదగియున్నది. ఇందు కూతుకతోడ నిత్యాదికతిపయశబ్దరూపములను అచ్చుతప్పులను సంస్కరించుట యపేక్షణీయమయియున్నది.

విధేయుఁడు
వేదము వేంకటరాయశాస్త్రి.

---

సీ. వాక్యసారస్యంబు పరికించినట్లైన మునుసుగిట్టనిమాటల్ కొనకయున్న
కల్పితాలంకారగరిమ గన్నట్లైన బుద్ధిలో శ్లాఘింపఁబూనకున్న
శయ్యాచమత్కారసరణిఁ గన్నట్లైనఁ గళలెల్లగరగరగఁ బొంగకున్న
వృత్తిసందర్భంబు వీక్షించినట్లైన సేవింపమతియు వీక్షింపకున్న
గీ. ఔర యుష్మత్ప్రణీతమీ వారకాంత వారకాంతను మహిఁ గ్రిందుపరచి సరస
సమితికర్ణంబులఁ గూర్చియశంబు నీకు నిచ్చు నిజము భుజంగరావనీంద్ర సుకవి॥

ఆదిపూడి ప్రభాకరరావు.

---

ఉ. కాంచితి వారకాంతయను గ్రంథము శీర్పతిశాస్త్రిగారు శో
ధించితదీయమిత్రునకు నిచ్చిన వేంకటశాస్త్రిగారు నా
సంచికఁ జూచి చూచితమసన్నిధినుండిన నాకొసంగ నే
మించిన వేడ్కతోఁ జదివి మిక్కిలి చొక్కితి దాని మాధురిన్
ఆ. ఆటవెలఁదులందు నాటవెలందుల బూటకమ్ము లెల్ల జాటి వారి
తేటగీతులెల్ల తేటగీతులఁ బల్కి ఘాటికేని కెందు సాటిగాన

క. ఆపదగు రంభా మాకథ తీపియుఁ జగువంగ నెట్టి తెంపరులయెదల్
నేపవెక రుణారసమును గాఁ పురిమల వాణికి దయెకాఁ బోలుసఖా

క. ధీచతురత లొప్పెడు మీ వాచాలత వీనులఁ దుపర లెను సుధమై
యాచంద మగుటచేనే మీ చెలిమిరిఁ గోరి నాఁడ మించిన నేడున్

సూర్యభట్ల వైద్యనాథము

సీ. మీరు రచించిన వారకాంత యనెడు చిత్ర ప్రబంధ మీక్షించినాఁడఁ
బండిత పామరమండలి కెల్లను వేద్యమై మరియు సుహృద్యమగుచు
సరసావళికి నెట్టి సరణిఁ గదోఁచి సాధువులకు సంతసంబు నిడుచు
నవనిఁ బరోపకారావళి కెట్లున్న స్వాంతరక్షకులకు స్వాదువగుచు

గీ. సర్వ విధముల చేత మజదివిచూడఁ బగనరచనయు మంచి కథయును గూడఁ
గలిగియున్నది భుజగరాట్కవి వరేంద్ర మంత్రి ప్రెగ్గడ వంశాబ్ధి మహితచంద్ర॥

కాశీభట్ల బ్రహ్మయ్య.

వారకాంతయను గ్రంథము పద్యకావ్యము. ఇది యైదు విలాసములుగ విభాగింపబడియున్నది. కవనము సకలజనులకు వేద్యముగ నున్నది. భోగము వారి నుంచుకొనిన వారిగతులీ గ్రంథము వలనఁ దేటతెల్లము లగుచున్నవి. అందఱును దీనిం బఠింపవలయునని కోరుచున్నారము. "చవి గాంచని చోఁ గవి గాంచు యెడన్" అను వాక్యము రీతి శ్రీవారనుభవశాలులకంటె నెక్కుడుగా భోగమువారి కుత్సితతంత్రముల గ్రంథమునను సంధించియున్నారు. అందఱకును దెలియవలయునని గాఁబోలు ఇప్పుడు లోకమున వాడుకగా నుండు "సాన్నెస్సు, డాల్యాలు, బ్రెయిన్సు, ఓల్డుమేనులు, మార్నింగు, కోటు, వాచి, బూట్సు, కంపాసు, మైనార్టీ" మొదలగు నింగ్లీషు పదములఁ బ్రయోగించియున్నారు. కేశవరావుగారి చరిత్రము విచిత్రముగా నున్నది. కవనము సరసము. ప్ర॥ వి ౮౨ వ పద్యమును, ద్వి॥ వి ౬౫ వ పద్యమును, తృ॥ వి ౨౦ వ పద్యమును శైలి విషయమునఁ జూపితిమి ఈవిధముగు పద్యములచే శ్రుతిమనోహరమయియున్నది.

పూండ్ల రామకృష్ణయ్య.

మేము తెలుఁగులోఁ బండితులము కాకపోయినను ఇది దివ్యమయిన క్రొత్త తెలుఁగు కావ్యమని ధైర్యముగాఁ జెప్పఁగలము. గ్రంథకర్తలు దీనిని బహుజాగ్రతతో వ్రాసియున్నారు. మఱియు దీనియందు దుర్విషయము లేవియు లేవు. దీని శైలియు బాగున్నది. ఈ కావ్యము ప్రారంభములోనే కవి యీ పద్యము వ్రాసెను.

సీ. హరితగోత్ర పవిత్రమైన మంత్రి ప్రెగడాన్వయమంగు పయంబునంది
సతత మార్కండేయ శంభుపాదాబ్జసంసేవచేఁ గవితా విశేషమంది

యలరుభుజంగరాయాభిధానుఁడ వారవనితలనుబ్రవర్తనలుఁ గొన్ని
మదికి నాశ్చర్యంబు నొదవింపవివరించు గ్రంథమొక్కటి వారకాంతయనఁగ
గీ. నేరచించెద నీకృతికీశ్వరుండవై యీశ్వరుఁడుగాఁగ నేను వేలేండ్లు కలిమి
గమునఁజరుగవికారివత్సరమునమాఘ వాఖ్యమాసమునందు నాదివశమి॥

కావ్యాంతమున నీక్రిందిమూఁడుపద్యములు వ్రాసియుండెను. వీనివలననే యీ గ్రంథకర్త యీ కావ్యమును, ఎంతలోకోపకారచింతతో వ్రాసినదియుఁ దెలుసుకోవచ్చును. ఈపుస్తకమునుగురించి యింకఁగొన్ని సంగతులు ఇఁకమీఁద రాఁగల పత్రికలో వ్రాయుచున్నాము. ఆ పద్యములెవ్వియనఁ-- పంచమవిలాసములోని 84, 93, 94 సంఖ్యగల పద్యములయియున్నవి.

ఆంధ్రభాషాగ్రామవర్తమానిపత్రికాధిపతి.

ఆహా! వారకాంతయను పేర తామురచియించిన నవీనగ్రంథము తమదయావలన నాకుం జేరినది. దానిం గూరిమిమీఱఁ జదివిచూచినాఁడను. గ్రంథమంతయు మృదుమధురశైలితో నలరుచు లోకోక్తులం బరగి కాముకజనంబుల కెంతయు నీతిబోధకంబుగా వెలయుచున్నది.

అచ్చటచ్చటఁ గొన్ని పద్దెంబులు ముచ్చటమీఱ వసుచరిత్రములలోని పద్యంబులంబోలె నమితమమకంబులుగలిగి శబ్దార్థాలంకారపూరితంబులయి మీఱుచున్నవి. నాదృష్టికిం దండగుణములే కాన్పించినవిగాని దోషంబు లెచ్చటనుం గానరాలేదు. కొన్ని స్థలములయందు మాత్రము పురాణభాషా పదంబులుపయోగానుసారంబుగాం బ్రయోగింపఁబడియున్నవి. అట్లనేకులు పూర్వకవులు యవనభాషాభివృద్ధిగలనాఁడా యాపదంబులు ప్రయోగించియున్న సంగతి యెల్లవారికిం దెల్లంబె కదా! నేఁడిట్లు మన గ్రంథములయందు మాత్రమె ప్రయోగింపఁబడియుండలేదు. కావున నా విషయము మనకవిమర్శనీయము గనుక నాయభిప్రాయమిట్లు విన్నవించుకొన్నాఁడను.

ఈనవీనగ్రంథంబు వారకాంతయను పేరువహియుంటం జేసి తన నామధేయంబు సార్థకంబుగా సకలజనరసనాగ్రరంగస్థలంబునం దాండవం బాడుచు సర్వసౌమ్యంబుగాఁ బ్రబంధసంగతి నెల్లవారల యుల్లంబుల రంజిల్లఁజేయుచు వారకాంతవలె వెలయుచున్నను—

"శ్లో॥ సత్యానృతా చ పరుషా ప్రియభాషిణీ చ హింస్రా దయాళురపి చార్థపరా వదాన్యా
నిత్యవ్యయా ప్రచురనిత్యధనాగమా చ వారాంగనేవ నృపనీతిరనేకరూపా॥"

అనియున్న లోకపరిపాటియగు మాటనుగీటుపుచ్చి తదవగుణంబులు విడనాడి; తద్వ్యతిరేకభావంబుఁ గాంచి, కేవలసత్యసూక్తియు, ప్రియభాషిణియు దయారసహృదయయు, నిత్యవదాన్యయు, నిరతధనవ్యయయు, నగుమీసత్ప్రభుత్వరీతిచే నలరుచుండెను నీతిననుసరించుచుఁ దానుగూడనట్లనె వెలయుచున్నది ఇదియంతయుఁ విచిత్రంబై యొప్పుచుండెనదిగావున భావుకులందావులీనెడు దావక ప్రతిభావిశేషంబు

శేషజ్ఞులగు నెల్లవారును వినుతిసేయకుందురే యని యనేకవిధంబులం గొనియాడి విన్న
వించుకొనుచున్నాఁడను,

సత్యవ్రోలు-సోమసుందరరావు.

---

సీ. తా రచియించిన వారకాంతా నామ చాటుప్రబంధంబు జదివి వాఁడఁ
జామరజ్ఞేయమై పండితాళికి మహోల్లాసంబు సమకూర్చు లలితశైలి
గలిగి త్రిలింగలోకమునకత్యంతోపకారక గ్రంథమై కరము వెలసె
బహుజారుఁడైన వారకాంతను గన్న వారకాంతను జూచు వాఁఛఁ గొనఁడు
గీ- ఇట్టి గ్రంథంబులేరచియింప బుద్ధి పుట్టఁ జేయుత తమకల్ల భూతవిభుఁడు
పూతమంత్రి ప్రెగడకులపూర్ణసోమ ప్రభువర భుజంగరాయ కృపావిధేయ
సీ. చక్రాని ముత్యముల్ జతలేర్చి కూర్చినకమనీయ విమలహారము వితానఁ
గమ్మని తేనియల్ కలిగి తావుల నెల్ల దెసలఁ జిమ్మెడు మల్లితీఁగె పగిది
శుకపిక శారికా ప్రకర గీతములతోఁ గోమరారు కొమ్మ విరుగున్న రీతిఁ
జిత్రాతిచిత్ర ప్రసిద్ధ సుయుక్త మహానాకాధిపతి నందనంబు సరణిఁ
గీ గనియయంత నయాహ్లాదమును బొనర్చుఁ దమరచించిన వారకాంతయను సుకృతి
పూతమంత్రి పెగ్గడకులపూర్ణసోమ! పరిభుతర! భుజంగరాయ! నృపాలగేయ ౧॥
క. తమ వారకాంత యీ లోకమునందన రారు వారకాంతల మీఁదం
దమిఁ దోలఁ చియే కతిన్ క్రమపాతను నేర్పె మనుజగణమునకు బళే!
గీ సరసపదసౌష్ఠవంబు, రసప్రయుక్తి భావగాంభీర్యమును గల్గి వారకాంత
బాపురే! కులభామిని పగిది నొప్పె నమలగుణాఢ్య! శ్రీభుజంగాగ్రగణ్య ౨॥

జయంతి భావనారాయణ.

---

శ్లో॥ సర్వాలఙ్కారయుక్తాం సరసగుణయుతాం ఛందోపహీనాం రసాఢ్యాం
సద్భిస్సంద్రర్శనీయాం సరసహృదయుతాం సాధువాక్యాం సుశయ్యాం
ధ్వన్యర్థధ్వన్యాశ్రితాంతాం భుజగపతిమహాపండితాగ్రిస్సనాథామ్
సేవన్తాం వారకాన్తాం సుదృశజనమనోహారిణీం వారకాన్తాం

నిట్టల వేంకటశాస్త్రి.

---

వారకాంత — ఇది యేలూరుపురవాసులును వెల్లలక్ష్మీవరము యస్టేటు కధికారులును మంజువాణీపత్రికాధిపతులును అగు మ॥రా॥రా॥శ్రీ॥ అష్టావధాని శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు జమీందారు గారిచే రచియింపఁబడి కలావతీ కలంకరింపఁబడిన విలాసముల పద్య కావ్యము. ఇందుఁ గేశవరావను నొక బ్రాహ్మణుఁడు కనకాంగియను వారకాంతను నిచికొనిడానికిఁ దనయింటనున్న సర్వస్వ మర్పించి తుద కుదీనుడై

దుస్సహములగు నిడుమలు గనుచు వశులై వచ్చినవారై ఎట్టకేలకు వేశ్యావృత్తము లిట్టివని తెలిసి దానిని విడిచి, విరక్తుండును, విజ్ఞానియునై నిజబాంధవ్యంగలసి మెలసి సుఖంబున్న కథ చక్కని సులభశైలితో లోకోక్తులతో సామెతలతో స్వభావసిద్ధముగా నిప్పటి కాలమున కనుకూలించునట్లు క్రొత్త క్రొత్త కల్పనలతో వ్రాయఁబడి యున్నది. కొన్నిచోట్లఁ దను చుగా నపూర్వములు నపరూపములు నగు నింగ్లీషు పదములు, హిందూస్థాని పదములు లోనగునవి చేర్పఁబడినవి. అక్కడక్కడ నల్పదోషంబులుండినను కవిత్వము ధారాళముగా సరసముగా నున్నది. ఇందు వ్రాసిన విషయమంతయు నిపుడు జరుగుచున్నట్లు వ్రాయఁబడెను. వేశ్యలమాయోపాయములన్నియు నీగ్రంథము వలన నెల్లరకు వెల్లడికావచ్చును. ఈగ్రంథము పేరు ఏకదేశగ్రహణముచే వారకాంత యనుటకన్న 'వారకాంతాప్రవర్తనా' మని కాని మఱియొకలాగునఁ గాని యున్నఁ బాగుగ నుండునని మాయభిప్రాయము. శ్రీవారు గొప్పజమీందారులయి యుండియు ఆంధ్రగీర్వాణాది భాషలనభ్యసించి యిట్లు గ్రంథముల రచియించుచుండిరనుట కరము సంతోషకరము అట్లు గావున వీరిని అధునాతనభోజరాజ శ్రీరాజ అని పిలువనొప్పునను కొంతయైన సంశయము లేదు- కవితాశైలిం దెలుపుటకై ఇందలి ప్ర॥ వి ౧= వ పద్యమును, ద్వి॥ వి క్ష, ౧౯ పద్యములను జూపుచున్నాను-

శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి.

సీ. శ్రీమత్పవిత్రమంత్రిప్రగడాన్వయ జలధిచంద్ర శ్రీభుజంగరాయ
సరసంబుగ శుభవద్వాగ్విచిత్రంబైన వారకాంతాభిఖ్యవరకృతిని
ఘనదయామతితోడఁ గంజాము వెంకటరత్నమంత్రియె సంగ్రహముదమంది
సాంతంబు గాఁదినిఁ జదివినాఁడను నాదు మిత్రులందఱు విని మెచ్చికొనఁగ
గీ. సకలపదసౌష్ఠవంబును సరసశైలి లసదలంకారపుష్టియు రససమృద్ధి
గలిగి విలసిల్లు నీవారకాంత నహహ జనులఁ గవులెల్లఁ గరము నాశ్చర్యపడరె ౧॥
ఆ. వారకాంత చేత వారకాంతలవగు వివిధమర్మములను వెలయఁబలుకఁ
జేసితీవు నీదు చిత్రచాతుర్యంబు శక్యమే పొగడ భుజంగరాయ ౨॥
సీ. శ్రీమత్పవిత్రమంత్రి ప్రెగ్గడాభిఖ్య వంశమ్ము కెవ్వాఁడు వన్నె దెచ్చె
మృదుశైలి నెవ్వాఁడు కృష్ణార్జునచరిత్ర మనఁనొప్పు ద్వ్యర్థి కావ్యంబుఁ జేసె
సరససీతారామచరితాది బహుకృతుల్ కవులు శ్లాఘింపంగ నెవఁడొనర్చె
కృష్ణభూపతి బహూకృతులందఁ జేసె నెవ్వాని మాడూరు సంస్థానమందు
గీ. అట్టిసూర్యప్రకాశమహాకవీంద్రుఁ డవతరించె మఱల నిజాన్వయమున
కీర్తి వెలయంగ తాత్వదాకృతిగ నిపుడు సకలకవిగేయ శ్రీమద్భుజంగరాయ ౩॥

పులవర్తి అన్నపూర్ణయ్య.

# Manju Vani Press, Catalogue.




**1903-1904.** సంవత్సరమున ప్రచురింపఁబడు గ్రంథములు.

౧ వివిధవిషయములు.

౨ శివగీత తె॥ కావ్యము. పత్రికాధిపతి.

౩ శ్రీనివాసవిలాసము. శతావధానులు, తిరుపతి వేంకటేశ్వరకవులు.

౪ అచలాత్మజా పరిణయము. శ్లేష యమకచక్రవర్తి వేంకటాచార్యులు.

౫ కాళిందీకన్యాపరిణయము. అహోబలపండితుఁడు.

౬ దాశరథివిలాసము. క్రొత్తపల్లి లచ్చయకవిప్రణీతము.

౭ అహోబలపండితీయము. అహో.

౮ వచనభాగవతము. డి.వి.శర్మగారు.

౯ శ్రీకృష్ణనాటకము. పత్రికాధిపతి.

చందా సంవత్సరమునకు రు 3 లు, విద్యార్థులకు, స్త్రీలకు రు ౨ లు.

---

☞ పథియు విలాసము, మేనేజరు మంజువాణి యేలూరు, గోదావరిజిల్లా,

# విమర్శనగ్రంథములు

2 మనువసుప్రకాశిక- వెల ౬ అణాలు- ఇది కాశీభట్ల బ్రహ్మయ్యగారిచే వ్రాయబడినవిమర్శనగ్రంథము- ఇందు మనుచరిత్రవసుచరిత్రలయొక్క మంచిచెడ్డలు ఖండించి వ్రాయబడినవి- వసుచరిత్రలోని సరసము పైకితీయబడినది

3 వివేకచంద్రికా విమర్శనము. వెల ౧౨ అణాలు ౧౩౦ పేజీలు ఇది కాశీభట్లబ్రహ్మయ్యగారిచే రచియింపఁబడినది. రాయబహద్దరుకందుకూరి వీరేశలింగముపంతులుగారి యఫ్‌యమ్‌యుగారి రాజశేఖరచరిత్రయను నవలపై నిసలక్షణమయిన విమర్శనము- మనలో విమర్శనములు లేనికొరత విశేషముగానున్నదను తలంపుఒకటి మనస్సునవిశేషముగా బాధింప, ఆకొఱతను సాధ్యమయినంతవరకు దీర్చుమనినన్నునిర్బంధపెట్టుటచే నూతనముగాబయలుదేరుచున్న నవలాకారులకు కొంతపనికివచ్చునని యెంచి నేనీగ్రంథముపై విమర్శనమును వ్రాయబూనుకొన్నాడను. కావులవేత్తలుదీనినిస విమర్శనముగాను, సాకల్యముగాను చూడగోరుచున్నాడను. " అనిగ్రంథకర్తవ్రాసెను. ఇందు, కథామూలము, ఇతివృత్తము, పాత్రములు, రసము, వర్ణనములు, అలంకారములు, నీతులు, ఆచారవ్యవహారములు, జ్యోతిషప్రశంస, ఉపసంహారాదులతో వెలయుచున్నది

4 భాస్కరోదంతము- వెల ౮ అణాలు- ఇది కాశీభట్ల బ్రహ్మయ్యగారిచే రచియింపఁబడినది. ఈగ్రంథమువలన భాస్కరులెందరు ? ఆంధ్రరామాయణము చేసిన భాస్కరుఁడెవఁడు ? అనిగ్రంథదృష్టాంతము, కులభేదము. నామస్థలకాలసంతానభేదములు, కృతికర్తకృతిభర్తలకుగలసంబంధము, రామాయణాకవులకాలము, లోకప్రతీతి, మున్నగునవి విమర్శించి నిర్ధారణచేసియున్నారు. శ్రీరామమూర్తికవి జీవితములు అనుమందరమును నెలకొల్పదానికి వీరేశలింగకవి ఆంధ్రకవిచారిత్రము, అనుగూఢపాత్రికమునుజుట్టి మథింపగా దేలినయమృతము " ఇట్టిమథనమువలన మొదటనిష్టదాయకములగు హాలాహలాదులుకొన్ని పుట్టినను తుదకమృతముత్పన్నముకాకపోదు. " అనిగ్రంథకర్తవాక్రుచ్చెను-

5 సునందినీపరిణయవిమర్శనము వెల ౪ అణాలు. ఇది నందిరాజు చలపతిరావుగారిచే రచియింపఁబడిమద్రాసు క్రిస్టియన్ కాలేజి ఆంధ్రభాషాభివర్ధనీసమాజమందుపన్యసింపబడినది.

6 అసహనారణ్యనిర్మూలకుఠారము వెల ౨ అణాలు. ఇందలిఅంశములు కవిరాజసందర్శనవిమర్శనము, శశిలేఖ మసిలేఖ చికిత్సలుగుప్తముగను కవుల కష్టము, కవిసందర్శనవిమర్శనోచ్ఛేదము, పరసహనాజ్ఞానజననీతిప్రబోధము, శశిలేఖాఽసహనము, శశిలేఖపత్రికాధిపతిప్రాగల్భ్యత, కవివిమర్శకచోరశృంఖలము.

☞ పయినిలాసము మేనేజరు మంజువాణి యేలూరు, గోదావరిజిల్లా.

# ప్రహసనములు

రాజా భుజంగరావు బహదరు జమీందారు ప్రణీత ప్రహసనములు.

7 చమత్కారస్నేహప్రహసనము. ౨ అణాలు వ్యభిచారదూషణము.

8 మహారోగరహస్యప్రహసనము. వెల ౨ అణాలు.

9 విధవావివాహ ప్రహసనము వెల ౨ అణాలు.

10 నిరపవాదప్రహసనము. వెల ౨ అణాలు.

## పల్లెటూళ్ల పట్టుదలలు 60 పేజీలు వెల 4 అణాలు

ఇది కింకవీంద్రఘటాపంచాననాది బిరుద విరాజితులును, సమస్తాంధ్రదేశప్రచారులును. యశోధనులునగు శతావధానులు తిరుపతి వేంకటేశ్వర కవులచే రచియింపబడినది- బ్రాహ్మణులుగల ప్రతియూరిలో నెప్పుడో యొకప్పుడీ పట్టుదలలు జరుగుచుండును- పేరులు మార్చినంతమాత్రమున ప్రతియూరికిని ఇందలి పాత్రములు సరిపోవును- ఇందు పెండ్లిండ్లలో పెట్టుపోచీలు, వీధిపిలుపులు, బ్రాహ్మణుల చుట్టలు గాల్చుట, బడితెబాజా, వేదములో పాడుముబీల్చుట, రాజులపెండ్లి, భోగము మేళము, శాఖావివరము, పెండ్రుకలపరీక్ష, కన్యావరుణ రివాజు, బ్రాహ్మణులకట్టు, తెగసాగుట, సంభావన, మహజరుకాకితము, చీట్లపేక, ముండలు, తప్పుదస్తావేజులసృష్టి, బచ్చలపాదు, అర్చకుడు. కన్యాశుల్కము, నంబులు, బంధువిరోధి, రోకలి పుచ్చుకొని బుర్ర పగులవేయుట. ఉదాసీనుని అరుగు, దధిందక్కపట్టు, నియోగివైదికవిచారణ. దొంగ దస్కతులు, కావేషీలు, స్వాములవారు, బూతులాట, భోజనములు, శుభకార్యములు, పాటీకలపడము, దేవాలయపు స్వస్తి, కల్లబొల్లి మాటలు, బంధువిరోధివిజయము. తద్దిగణతోంగుక్తాయింపు, కవిత్వముతో తిట్లు మొదలగువిషయములతో మిక్కిలి రమ్యముగా నున్నది- పూర్వము సంస్కృతపండితులు ప్రహసనములు వ్రాసి జనాహ్లాద మొనరించుచుండిరి- ఆంధ్రులు కొందరు ఆదారిని బోయిరిగాని రసముమాత్రము తేలేక పోయిరి. ఈశతావధానులు సంస్కృతాంధ్రములయందు బరిపూర్ణపండితులై లోకజ్ఞానకోవిదులై రసముచిప్పిలునట్లును జనసంఘమునకు తెల్లమగునట్లు అత్యంతనీతిబోధకముగ హాస్యరసాముపానముగానీగ్రంథమునురచియించిరి. ఇదిచదువునప్పుడెల్ల కడుపుచెక్కలగునట్లు నవ్వు వచ్చును. అనేకస్థలములయందు అసాధారణపాండిత్యము వెల్లడించబడినది. ఈగ్రంథము చదివినగాలిపలె నెగిరిపోక పదిపదునేనుదినములపర్యంత మిందలి కథాసందర్భములు కన్నులకుగట్టినట్లు కాన్పించుచుండును. ఇటులయినతీరిక జేసుకొని యీగ్రంథము నొకసారి చదివిననిశ్చయముగా కొంతలాభమునుపొందగలరని నమ్ముచున్నాము.

☞ వయివిలాసము మేనేజరు మంజువాణి యేలూరు, గోదావరిజిల్లా.

# లక్షణగ్రంథములు

12 సర్వలక్షణసారసంగ్రహము వెల ౧-౨ అణాలు. ఇది కూచిమంచి తిమ్మకవిచే రచియింపఁబడిన గొప్పగ్రంథము. ఇందు నేఁటి స్వల్పపాండిత్యముచే తప్పులనుకొని దిద్దఁబోవు ప్రయోగములనేక గ్రంథదృష్టాంతములచే సిద్ధాంతము చేయఁబడినవి. లక్షణములన్నియు సులభశైలిని పద్యములతో వ్రాయఁబడినవి అప్పకవి యాక్షేపణము లనేకములు ఖండింపఁ బడినవి. భాగవతోత్కృష్టత వెల్లడిచేయఁబడినది. బి ఏ. కు పఠనీయము.

13 ఆంధ్రచంద్రాలోకము వెల ౬ అణాలు. ఈగ్రంథము అడిదము సూరకవిచే రచియింపఁబడినది- చక్కని యుపోద్ఘాతముతోఁ గూడియున్నది అలంకారములన్నియు నిందు స్పష్టముగ వ్రాయఁ బడియున్నవి-ఎక్కువపండితసహాయ మక్కఱలేక యే అందరికిని తెలియదగునటుల పద్యములతో వ్రాయబడెను-

14 శకటరేఫనిర్ణయము. వెల ౭ అణాలు. ఇది భారతము లక్ష్మీపతిచే రచియింపఁబడినది- ఇందు ఱా రేఫలయొక్క విమర్శన బాగుగా లక్ష్యలక్షణములతో విపులముగా వ్రాయబడినది-ఇందలి యుదాహరణములు భారతములోనివి

15 అహోబలపండితీయము- ఆంధ్రవ్యాకరణము వెల రు ౧-౪-౦ ఇది ఆంధ్రవ్యాకరణము అహోబలపండితునిచే వ్రాయబడి చిరకాలమునుండి ఆంధ్రదేశమున భాష్యగ్రంథమువలె గౌరవముగా పరిగణింపబడుచున్నది అహోబలపండితుడు తన సామర్థ్యమంతయు ఆంధ్రవ్యాకరణముపై వినియోగించి వ్రాసిన యీగ్రంథము దాని యుత్కృష్టతనుబట్టి యేముద్రితముగాకున్నను, ఇంతకాలము నిలిచియున్నది. సౌజ్ఞాసంధిపరిచ్ఛేదములు, ౨౮౦ పేజీలలో ముద్రింపఁబడినవి పండితుల నేకులు తొందర పెట్టుటచే ఇది ప్రథమభాగముగా ప్రచురించితిమి. ప్రాచీనకాలానుసారముగా ఆంధ్రవ్యాకరణమైనను సంస్కృతభాషయందు వ్రాయబడినది. ఆంధ్రవిషయమాంధ్రముననుండుట మేలని తలంచి ఈగ్రంథ సాంధ్రతాత్పర్యసహితముగా ప్రచురించితిమి. ఆంధ్రభాషయందే మాత్రము పరిచయముకలవాడును, ఈగ్రంథము చదువక భాషాభిజ్ఞుడననుట కేవలము పొరబాటు- ఉద్గ్రంథముగుటచేతను అనేకమందిదీనినికోరుటచేతను, ప్రస్తుతము కొద్దిప్రతులే ముద్రించుటచేతను, తొందరపడి తెప్పించుకొననివారికి నిశ్చయముగా ప్రతులు దొరుకజాలవు.

16 కాగడా. వెల ౧ అణా- ఇది కాశీభట్ల బ్రహ్మయ్యగారిచే రచియింపఁ బడినది. ఇందు కాగడా అనుశబ్దమునుగూర్చి పెక్కులగు ఉదాహరణలతోడను, వ్యుత్పత్తులతోడను, శబ్దతత్త్వమంతయును మిక్కిలి విమర్శించి వ్రాయఁబడెను.

పయి విలాసము మేనేజరు మంజువాణి, యేలూరు, గోదావరిజిల్లా.

కవిజీవితములను వ్రాసి ఆచంద్రార్కముగ కీర్తివహించిన బ్రా॥ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారిచే రచింపఁబడిన

# వినోదచరిత్రలు

17 తిమ్మరుసుచారిత్రము. వెల 4 అణాలు. ఇది గురుజాడ శ్రీరామమూర్తి రచితము. ఇందు తిమ్మరుసునకు మంత్రి పదము వచ్చుటయు. మరల దుర్దశ వచ్చి యూరు వెడలిపోవుటయు, తిమ్మరుసును భార్యయు పడినకష్టములు, రాజుపిమ్మట వెదకించి తిమ్మరుసునుందెప్పించుటయు తక్కినమంత్రులు తిమ్మరుసుమీది యీర్ష్యచే రాజువలన పరాభవమును పొందుటయు తిమ్మరుసుపిమ్మట ఉన్నతదశకువచ్చి అనేకచిత్రములగు పనులుజేసి రాజును మెప్పించుట మొదలగుకథలతో మనోహరముగానున్నది.

18 అప్పయదీక్షితచారిత్రము. వెల 4 అణాలు. ఇది గురుజాడ శ్రీరామమూర్తివిరచితము ఇందు మధ్యమధ్య చిత్రవిచిత్రములగు పండితగాథలును, మతవిషయకోపన్యాసములును, విష్ణుసహస్రనామములకు శైవభాష్యరచనయు నారాయణశబ్దము శివపరార్థము చేయుటయు, దీక్షితునిలింగధారణమును, కవిచరిత్రవిమర్శనమును, దీక్షితులనిర్యాణానంతర కథయు, తాతాచారితో వాదములుచేయుటయు, కాశీలో దీక్షితులవారు చెప్పినశ్లోకములు, విధవావివాహయత్నపరిసమాప్తి, అప్పయదీక్షితుడు వాజపేయము జేయుట, రంగనాయకులు శిశువుగామారుట, చీనాదేశవస్త్రములువచ్చుట, దీక్షితుడువస్త్రమును హోమము చేయుట, సభాతాంబూల మెత్తుట, వైష్ణవమతనిరసనము, శివుని ధ్యానించుటకుమానసబోధ, భారతరామాయణసారసంగ్రహస్తోత్రములు; తాతాచారికుతంత్రము, నిర్యాణకారణము మొదలయిన పెక్కుగాథలు గలవు.

19 గోపరాజురామప్రధానిచరిత్ర-రు 0-4-0. ఇది గురుజాడ శ్రీరామమూర్తివిరచితము. ఈరామప్రధాని ముప్పదియిద్దరు మంత్రులలోనొకడు. ఈతని చరిత్ర వినవింపుగానుండును. "గణికనిర్వాహంబుగల్పించె నూరూర, మాకి గోపరాజు రామప్రధాని" అని ముప్పదియిద్దరుమంత్రుల సీసమాలికలో ప్రకటించియున్నారు. ఈమంత్రిచారిత్రమున కేవలమంత్రిగానుండిన చేసినచమత్కారములేగాక, కవీశ్వరుడుగా పెక్కుచిత్రములుజేసి పేరుపొందినగాథలుగలవు. ఈమంత్రి గజపతియాస్థానమున యేబదిమందినియోగులకు మిరాసీలు ఇచ్చిన చిత్రగాథచదివితీరవలయును గాని వ్రాయుటకువీలులేదు.

28 వసంతకుసుమము వెల ౧ రూపాయి. ఇది రాజా భుజంగరాయప్రణీతము. శ్రీమద్విక్టోరియా రాజ్ఞిగారి చరిత్రము. నాతికఠినమయిన పద్యకావ్యము, పండితులు ప్రభువులచే మన్నింపబడిసిన గ్రంథము.

29 వారకాంత వెల ౮ అణాలు. ఇది రాజా భుజంగరాయ ప్రణీతము. వారకాంతలు జేయు మాయోపాయములు మొదలగునవి తెల్పుటకై యొక్క చిత్రమగు కథను కల్పించి పద్యకావ్యముగా వ్రాసిరి, చదువుటకింపుగాను రసవంతముగానుండును- యేమియెరుగని సమయములో నీపుస్తకముందిచ్చినట్లా పునగల పద్యములో నాలుగుచదివినను మరలవదలబుద్ధిపుట్టదు-

30 చారుమతిపద్యములు వెల ౨ అణాలు. ఇది రాజా భుజంగరాయ ప్రణీతము- మిక్కిలికష్టపడిన మహాపతివ్రతచారిత్రము- ఇదిపఠనముజేసిన స్త్రీలకు ధైర్యము, పుణ్యముగలుగుననుటకు సంశయములేదు, ఈగ్రంథమున అనురాగమాహాత్మ్యము వర్ణింపఁబడినది, నిశ్చయముగా కూర్మిగలగునటుల చారుమతి దేశదేశములు దుఃఖములతో ధ్యాటుతో త్రిప్పబడెను- స్త్రీలుచారుమతినిచూచి ఆమెకుగల ఓర్పు పతిభక్తి నేర్చుకొనవలయును, లోకము పతికొరకై తిరుగుభార్యకు సమస్తవిధముల సాయపడి తోడునీడై యుండవలెను- పురుషులు చంద్రసేనునివలె సుస్వభావులగు భార్యలయెడ అనురాగవంతులై కంటికిరెప్పవలె కాపాడవలెను. గాఢానురాగము పరీక్ష్యమగుటను కష్టములు స్వతస్సిద్ధముగా సంభవించును. అప్పట్టున చారుమతివలె స్త్రీలు తమసత్వమును విడచి చంచలస్వభావులు కాకూడదు

31 సుశీలపద్యములు వెల ౨ అణాలు. ఇది రాజా భుజంగరాయప్రణీతము. ఇదియొక మహాపతివ్రతకథ. ఇందుసుశీలను వ్యభిచారముచే నొక మహావిటుండు వంచింపఁజూచి వివిధమాయోపాయములుపన్ని తుదకు ఆమె తల్లిని మోసపుచ్చి, ఆమెను చంపింప తివురుట. దైవవశమున నామె చావుతప్పించుకొని పురుషవేషముతో తనజీవితమును గడపుచు ఒకరాజుకడ మంత్రియయి తననుమోసముచేసినవానిని తిరిగివంచించి, తనపతికదక్కి లోకమున స్త్రీలకందరికి పేరుదెచ్చెను. పద్యములయినను సులభముగానున్నవి,

32 విక్టోరియాస్వర్గయాత్ర వెల ౧ అణా. రాజా భుజంగరాయప్రణీతము. శ్రీ విక్టోరియా రాజ్ఞి మరణము కన్నీరొలుకునటుల వ్రాయబడినది.

33 విక్టోరియాతారావళి వెల ౪ అణాలు. శ్రీమద్విక్టోరియా రాజ్ఞీగారి చారిత్రము. ఇది శ్రీరాజామంత్రిప్రగడ భుజంగరావు బహద్దరు జమీందారు గారిచే మిగుల రసయుక్తమగునటుల పద్యకావ్యముగా రచియింపఁబడినది. రాజభక్తిని బోధించును. చూచుటకుపుస్తకము మిక్కిలి ముచ్చటగానుండును.

# విజయాంకసాహసము.

[256 పేజీలు. ✠ 15 భాగములు ✠ వెలరూపాయి.]

సాహసగ్రంథము లిదివరకాంధ్రభాషలో లేవు. ఆంధ్రగ్రంథములయందు హాస్యము కొంత. హాస్యరసానుప్రాణితమైన గ్రంథము గాని చదువరులకు విసుకుపుట్టకుండదు. లోకమున నవ్వుటకంటె ఆనందము లేదు ఈగ్రంథమొకరజ్ఞునిచేతికిచ్చి చదివించుచు, నెదుటనొక ఫొటోగ్రాఫరునుంచి ఫోటోలుతీయించిన ననేకవిధముల నా చదువరిమనస్సుమారుటను సులభముగా గ్రహింపవచ్చును. ఈగ్రంథమునుగూర్చి పండితవర్షధారవలె నభిప్రాయములు గురియుచున్నవి.

| [illegible] | హాస్యము | ౭౨ పాళ్ళు | జన్మభూమి వాత్సల్యము | ౨౦ | [illegible] |
|---|---|---|---|---|---|
| | శృంగారము | ౧ పాలు | పరోపకారము | ౫ | |
| | విచారము | ౧౨ పాళ్ళు | అనురాగము | ౧౫ | |
| | ధర్మము | ౩ పాళ్ళు | ప్రగల్భము | ౧ | |

ఈగ్రంథమునకు వన్నెతెచ్చునవి యందుక్రిందనుదికించిన వచనములే; గ్రంథము మొదటిభాగమునుండి కడవరకునొక్కటేరీతిగా హాస్యము-సంఘమునకు వలయుమార్పులు చమత్కరించివ్రాయబడినవి. ఈగ్రంథపఠనము యోచనశక్తికి పని గలిగించుచు నాడీగ్రాలోచనమును హాస్యమువలన తగ్గించును.

✠ ✠ "ప్రముఖులయభిప్రాయములు." ✠ ✠

"ఏమియుందోచకపోవుటకు ఔషధమువలెను, జీవయాత్రలోకనబడుసంశయములకు నిఘంటువువలెను, వ్యవహారములకు లాయరువలెను, వైరాగ్యములకు వేదాంతివలెను, ఆనందమునకు తత్త్వశాస్త్రజ్ఞునివలెను యీగ్రంథముతనరుచున్నది"

'ఈగ్రంథముచదువుటయేగాక, చదివి ఆనందించితిమి'

'ఈగ్రంథమందలి విమర్శనములు మిక్కిలి స్వాదువుగా వ్రాయబడినవి'

'గ్రంథశైలి, బండి, రైలు, పడవ, కాలినడకలననుకరించుచు సందర్భానుసారముగా మారియున్నది' 'కొన్నివాక్యములు వేదవాక్యములవలె నాచంద్రతారకముగ నిలువదగి యున్నవి'

మృత్యువువిషయమై మీరువ్రాసినదిచదివిన లోకమునుభయంకరముగా జేయుచున్నది, ఈగ్రంథమందు విచారములోని నలుసులు మైక్రాస్కోపులో బెట్టి చూపించినట్లున్నవి.

స్నానవిషయము, రాక్షసుని వ్యాకరణ విషయము, విధవలుఎదిరిమంగలులు, కాశీలోనివస్తువిసర్జనము, మెట్టవేదాంతము, హిందూభోజనశాల, జ్యోతిషవిషయము మిక్కిలి ముచ్చటగానున్నవి. ఏమండి మీవ్రాతనేర్పు—అది ధాతనేర్పు."

☞ పయివిలాసము మేనేజరుమంజువాణి ఏలూరు గోదావరిజిల్లా

ఈ ౨౦ శతాబ్దములో తిరగ నేర్చినవాడెవడును ఈ గ్రంథము చదువకయుండ రాదు. ప్రాచీనకవులశాసనములవిషయమై చదివినపుడందు గర్భితముగానున్న హాస్యము తెలియక నిజమేయనిపించినది హాస్యమని కనుగొనినపుడు మీప్రాగల్భ్యము కనుపించినది.''

"ప్రస్తుతకాలపు కవులను గూర్చి వ్రాసిన భవిష్యత్పురాణగాథ మిగులరసవంతమును యథార్థముగానున్నది. క్రీడావినోదములు హాయిహాయియనుపించును. మేజువాణీలో దిత్తోంగానికొ అక్కైనవెదకుట కడుపులు చెక్కలగునట్లు చేసినది."

...కవిపురంధరుండురసి కాళిహృదామ్ములుల్లసిల్లఁగాఁ।
గుకవులుతల్లడిల్లఁగనుఁ-గూరుపి డెవ్విజ ... సాహసం।
బొకటసుశైలినంచితర-సోదితనూత్న విధంబెక్కెనగా॥ అని ఒకకవి కీర్తించెను.

OPENION OF M. R. RY. V. VENKATA RAYA SASTRI GARU,
SANSKRIT PUNDIT, CHRISTIAN COLLEGE MADRAS.

I have read with pleasure 'విజయాంకసాహసము' your Telugu narration of the adventures of...The style is simple & readable throughout. Your coinage of Telugu names for the personages is suggestive and ingenious. The humour with which you have seasoned the work throughout, especially the notes, is indeed enjoyable even though it may puzzle a juvenile reader. There is also throughout the work a suggestion of reform. You have not inflicted upon your reader the hackneyed descriptions of certain sets of things........... I believe the Telugu Public will feel thankful to you for this addition to its literature.

విజయాంకసాహసములో నుదాహరణశ్లోకములుగానున్న 'మీనవనాగరస్తుతి' ఒక్కటైనాపి ఎంతఖర్చైననుసరే పంపండి. అని యొకడిస్ట్రిక్టుమునసబుగారు వ్రాసిరి.

ప్రభువులసందేహములు, నుహమ్మదీయుని వాక్యములు, ధనపుపాతులు, మనుజదేవతాసంభాషణములు, కుక్కల మారకము—మ్యునిసిపాలిటీ, కేరళజ్యోతిశ్శాస్త్రులవలన తేలిన గణకథకము, శూద్రకర్మభేదములు, వెంట్రుకలున్న ల్లబసుటఉన్నతిపదవి నొందిన యొకగృహస్థుని పాట్లు, పొగడికల మోసము, వాతఊపములుపనికిరాకపోవుట, లోకము మూకీభావము, ఏమ్యాదులయిత్తు, నిద్రలేవగానేపరమజూచుట, శకునములవలలో జిక్కినకోమటి, నవనాగరస్త్రీవిషయము—వేశ్యలనుజూచుట, గ్రంథశృంగారము, పుంలింగమునపుంసకలింగమగుట, భార్యాభర్తలపిలుపులు,—(౨౨౦-౨౩౦) పేజీలలోని విజయాంకగంధినుల సంభాషణ, భవిష్యత్పురాణమండలి నర్తములు, కొంగజపములు, విటశూరులు, వైశ్యులగోత్రములు, ధర్మరాజుచోరత్వ, నూతనసంఘము, ప్రథమాంతము, సప్తమ్యంతములు, ఇందులో నేవిచదివినను తప్పక బుద్ధికి వికాసము, సంతోషముకలుగును

ఈ గ్రంథము చదువుటవలన బుద్ధికిస్వాతంత్ర్యము, పట్టుదల, సంఘవాత్సల్యము కలుగుననుటకు సంశయములేదు.

పయివిలాసము మే నేజరుమంజువాణి ఏలూరు గోదావరిజిల్లా.

## శిశుసంజీవని వెల 4 అణాలు

ఇందు గర్భములోనుండు పిండమును గూర్చియు, పిదప భూపతనమైన శిశువును గూర్చియు, ౧౦-౧౨ సంవత్సరముల వరకు పిల్లలను పెంచుటను గూర్చియు, లోకోపకారార్థము అనేక సంగతులు చెప్పబడినవి. ప్రతిస్త్రీయును దైవోద్దేశ్య ప్రకారము తల్లియగుచున్నది. అప్పుడు తల్లికివలయు జ్ఞానము తప్పకుండ స్త్రీలకుండవలెను. కొందరట్లుగాక, స్త్రీలపాటలు చదువుటతోడనే తమపని పూర్తియాయెనని సంతసించుచు పిల్లలనుగని తాతకో, ముత్తాతకో, ఆసుబిడ్డకో, దాసికో, చాకలనౌకరునకో, అప్పగించుచున్నారు. ఇది మిక్కిలి క్రూరమైనపనియని యదిమాన్పుటకే గ్రంథము వ్రాయఁబడినది వంధ్యలుతప్ప తక్కినస్త్రీలందఱు నీగ్రంథమును చదువుదురుగాక.

### మొదటి ప్రకరణము.

స్త్రీలస్థితి, గర్భిణీయగుట, గర్భిణీకాలమందు శరీరమెట్లు కాపాడుకొనవలయునో, గర్భోత్పత్తి, పిల్లలుపుట్టినతరువాత వారికిచ్చు మొదటి యాహారమగు పాలు శుభ్రపరచుట, పాలదాదుల నేర్పరచుట, అన్నప్రాశన యయినతరువాత శిశువులకు తిండి యెప్పుడెప్పుడెట్లు పెట్టవలయునో శిశువులుపాలువిడుచుట, పాలువిడచినతరువాత పిల్లలనెట్లు కాపాడవలయునో, మసూచికమను మహావ్యాధినుండి పిల్లలను తప్పించు ప్రయత్నములు, పాలపండ్లువచ్చుటకు సూచనలు బొటమనవ్రేలుకుడుచుట, శరీరపరిశ్రమ, నిద్ర, మలమూత్రములు, బాలరోగములు, వానిచికిత్సలు, కురుపులు, జ్వరములు మొదలగునవి వంకరపోకుండ కాపాడుట, వాపు, విరేచనబద్ధములకు సులభమగు చికిత్సలు, దద్దురులు, పిల్లలయేడ్పు, గురక, కీళ్ళనొప్పులు.

### రెండవ ప్రకరణము.

స్నానము, వేడినీళ్ళు, చన్నీళ్ళు. ఏయేకాలము నెట్టెట్టిదుస్తులు తొడగవలయునో, ఆహారము, నివాసస్థలము, గాలి, వత్తిమానుట, దేహపరిశ్రమ, ఆటలాడుకొనుట, నడువనేర్చుట, నిద్ర, పాలపండ్లూడివచ్చుట, శిశురోగములు—చిన్నబిడ్డ చేష్ట. పొడిదగ్గు. గొంతులోనుస, కంఠమువాయుట., ఊపిరితిత్తులు బిగబట్టుట, దగ్గు లక్షణము, విషపడిసెము, రొమ్మునొప్పి, నులిపురుగులలక్షణము, గజ్జి, తీట, వీనికితగిన విధము, ప్రసిద్ధులచేత నేర్పరుపఁబడినచికిత్సలు.

### మూడవ ప్రకరణము

స్నానముచేయువిధము తలవెండ్రుకలు, ఆహారము, దేహపరిశ్రమ, ఆటలు, బిడ్డ కుటుంబమున మెలగుట, ఉద్యోగము, దంతములువచ్చుట, శరీరతత్త్వాదిలక్షణములవలన తెలిసికొనఁదగినవ్యాధులు, వంగుట, గూని, చుట్టకాళ్ళుట, ముక్కు-చెవగుట మొటిమలు, కురుపులు, పులిపిరికాయలు, వీనికిత్సలుగలవు.

పయి విలాసము మేనేజరు మంజువాణి ఏలూరు గోదావరిజిల్లా.

# స్త్రీలకొరకు గ్రంథములు.

46 విక్టోరియావిలాసము వెల 3 అణాలు ౬౦ పేజీలు. ఇది కాశీభట్ల బ్రహ్మయ్యగారిచే శ్రీవిక్టోరియా చక్రవర్తినిగారి చరిత్రంతయు పాటగా వ్రాయబడెను

47 స్త్రీలపాటలు ౨౮౦ పేజీలు ప్రథమభాగము వెల ౧-౨ అణాలు
ఈగ్రంథమిదివరకు రెండుసారులు ముద్రింపబడినది ఇప్పుడు మరల ౩ వసారి ముద్రింపబడినది, వేలకువేలు గ్రంథములు ఖర్చు

48 స్త్రీలపాటలు ౨౮౦ పేజీలు రెండవభాగము వెల ౧-౨ అణాలు
ఇది రెండవతూరి ముద్రింపబడినది వెనుక వేసినప్పటికి పై విస్తారముగ మార్చబడెను. కొన్ని వందలపాడుపుకథలు, వామనపాట వైకుంటవర్ణనము మున్నగునవి పెద్దపాటలనేకములు క్రొత్తగానిందు ముద్రించినారము.

46 స్త్రీలపాటలు ౨౮౦ పేజీలు మూడవభాగము వెల ౧-౨ అణాలు
ఇదు ౫౦౦ లకుపైగా పాటలు చిన్నవియు పెద్దవియు గలవు శకుంతల మాళవిక దమయంతి చంద్రమతి మున్నగు నాటకస్త్రీల చరిత్రములు పాటలుగా మనోజ్ఞములుగానున్నవి ఇది మొదటిసారి ముద్రింపబడుటచే వేలకువేలు ఖర్చగుచున్నవి తొందరపడి తెప్పించుకొనినచో ప్రతులు దొరకవు.

50 నిజమైనకాశీమజలీలు ప్రథమభాగము ౮౦౦ పేజీలు వెల ౧ రూ.

51 నిజమైనకాశీమజలీలు రెండవభాగము ౮౦౦ పేజీలు వెల ౧ రూ.

52 ప్రేమాలేఖావళి వెల ౧ రూపాయి. పురాణపురుషులయొక్కయు నవీనజనాళియొక్క మనోగతాభిప్రాయములు లేఖలరూపమున నను.

53 బాలనీతికథలు ౭ అణాలు ఇది రాజా భుజంగరాయ ప్రణీతము ౩౦ దువిచిత్రములగు నీతికథలు పటములతో ముద్రింపబడినవి బాలురకును బాలికలకును అత్యంతోపయుక్తము కుక్క, కాకాని, గడియారము, పిల్లవాడు. కోతి, లుబ్ధుడు. సాలెవాడు, బాటసారి. గిన్నె, గరిటె, సిబ్బి. సూతుస్థిక కోడి, పల్లెటూరిబావ. పిల్లవాడు, ప్రతిధ్వని. సారాయిత్రాగువాడు, సీసా. తేనెయీగ, బుద్ధిహీనుడు. పాములవాడు, పాము. పిల్లి, భూమి. కోడి, పనికత్తెలు. కాపువాండు, మర్రికొమ్మ. పక్షి, దుర్మార్గుడు బీదవాడు, పువ్వు. సోమరిపిల్లవాడు. ఏనుగు, కుట్రపువాడు. జంగము, సాతాని. పట్టుబట్టలయొరువు. ఇసుకతక్కిడి, పేడతక్కిడి. కత్తి, కోమటి. భార్యవైధవ్యమునకేడ్చుట. ఇసుకలింగము వడ్రంగిపిట్ట. జొన్నవెన్ను. లోభి, వక్కలు. తల్లులు, పిల్లవాడు. దూడి, దొంగలు. అంధుడు లాంతరు. ధనవంతుడు, బాకీదారు. బానిసవాడు, ప్రభువు. దొంగలు, అధికారి. క్రూరుడు, వంచన రాజు, సౌదాగరులు కడుపునొప్పి, కంటిమందు. లుబ్ధుడు, కవి. శకునములు, సేవకుడు స్నేహితులు, పెద్దపులి. రాజు, ఆత్తులమారి బానిసవాడు. రాజు. గ్రుడ్డివాండ్రు. మూత్యములదొంగతనము గొల్లెతలు, నేయి. నమ్మకద్రోహము. యుక్తిపరుడగుపములగాపరి. అరబ్బిదేశస్థుడు బాటసారి సన్యాసి, లుబుడు తెలివితక్కువగుర్రపువాడు కోమటియుక్తి మొదలయిన అనేకకథలతో చక్కనినీతిని బోధించుచు చదువుటకింపుగానుండునట్లు వ్రాయబడినది.

# సంగీతగ్రంథములు

54 గానామృతము-వెల ౪ అణాలు. ఇది రాజాభుజంగరాయ ప్రణీతము. ఇందు స్వరములు, సాహిత్యమును పాడుకొనువారికి వీలుగానుండునట్టుల అనేకవరుసలలో వ్రాయఁబడియున్న కీర్తనలు, జావళీలునుగలవు.

55 రామాయణము హరికథ- బాలకాండ వెల ౧ అణాలు. ఇదిసరస్వతీభట్టరామకవిచే రచింపఁబడినది. ఇందు భాస్కరరామాయణము నందలి బాలకాండముకథ యంతయు, దోరాలతో, పద్యములతో మనోహరములగు కీర్తనలతో మిక్కిలిసొంపుగానున్నవి హరికథలకు మిక్కిలియుపయోగము అక్కడక్కడ ప్రస్తావనశ్లోకములునుగలవు.

56 మదనగోపాలవిలాసము, వెల ౪ అణాలు. ఇది పోచూరి మృత్యుంజయకవిచేతను, పెమ్మరాజు సుమిత్రింబచేతను, రచింపఁబడినది- ఇందుప్రాతఃకాల మంగళహారతులు, స్వామివారు తిరువీధులకు వేంచేయు కీర్తనలును ఆలయమునకువచ్చినపుడు కీర్తనలు, అర్ధచంద్రికలు, కందార్థములు, ఏకాంతసేవదరువులు- ఏకాంతసేవపద్యములు ఆరగింపుకీర్తనలు, నీరాజనసమయహారతులు, పవళింపుహారతులు, నిదురపాటలు, లాలి, జోలపాటలు, అష్టదిక్కులసంగీతపాఠకులు, పాడివలసినకీర్తనలును, వినసింపుగా బహుశ్రావ్యముగా రసవంతముగానున్నవి-

57 అశ్వచికిత్సాసారము. వెల ౧ రూపాయి. ఇందు గుఱ్ఱముయొక్కవయస్సు, శరీరతత్వము, రోగనిదానము, భేదికిచ్చుట, నస్యము, [రక్తనాళములనుండి నెత్తురుతీయుట] శీతోష్ణకాలములయందుచికిత్స, మెదడుజబ్బు, చెవిజబ్బు, కంటిజబ్బు, ముక్కుజబ్బు, ముట్టెజబ్బు, కంఠరోగము, మెడజబ్బు, రొమ్ముజబ్బు, నాలుకయిగుడుడు, శ్వేదరోగము, విదాహము, శీతోష్ణరోగములు. రక్తమూత్రము, విషవాతము, శ్వాసకాసలు, ఎండురోగము, జ్వరదోషములు, మాంద్యము, శూలనొప్పి, కుర్రిరినొప్పి, శగరోగము, కోసునజాడ్యము, అండవాతము, కాళ్ళయందు కంతివలెపుట్టుతీగకురుపు, కంతులు, లోదొడగడ్డ. అగ్నిబావు [ఉంముతెగులు] చిల్లనజబ్బులు, శుద్ధవాతము, కొంకువాతము, అండచాలువాతము, మందగుదివాతము, కాలివాతము, పక్షి, పల్లాస్తిరిలు, చురుకుష్టిపడిం మ లేహ్యములు, బలుపునకు లేహ్యము. విషములు మొదలగువాటికి విరుగుడు, పొగరుదింపుటకు పిచ్చెక్కుతీయుట మొదలగు చికిత్సలు, గొడ్డుబోతుతనము నుబోగొట్టుచికిత్సయు, పుట్టినపిల్లను బెంచుట, తొడజబ్బులు, వెనకాళ్ళజబ్బులు, పిక్కజబ్బులు, కీళ్ళజబ్బులు, డెక్కజబ్బులు, గుఱ్ఱముల సుళ్ళు, గుఱ్ఱముగొనుటకుకొలతె, నడకలు, జంతువుల మేతపరిమాణము మొదలగునవి చక్కగా వ్రాయబడియున్నవి. అన్నివిషయములు చక్కనిబొమ్మలతో అచ్చువేయబడుటచే నందరికి తెలియును.

☞ పుష్పవిలాసము మే నెలను మంజువాణి ఏలూరు [illegible]

58 గురుశిష్యసంవాదము. వెల ౹౨ అణాలు. ఇది వారణాసి చిదంబరాభిధానునిచే రచియింపఁబడినది. ఇందు మెట్టవేదాంతులు చెప్పు మాటలవలెగాక అచలతత్త్వము, చావుపుట్టుకల కారణము, పాపపుణ్యవిచక్షణము, మంత్రమంత్రార్థవిచక్షణము, ఆత్మవిచారము, జ్యోతిరూపవిచారము, జీవేశ్వరులసంగతి శాస్త్రానుగుణ్యముగా నేక ఉదాహరణలతోఁ వ్రాయఁబడినది.

59 మహాగారడి వెల ౪ అణాలు. ఇందు నేత్రోత్సవమగు నటుల చమత్కారములు, తమాషాలు తెల్పబడినవి. ఇందు అగ్నిస్తంభన, వాయుస్తంభన, జలస్తంభన, టక్కు, టమార, గజకర్ణ, గోకర్ణము మొదలగు నింద్రమహేంద్రజాలములును, యక్షిణీచిత్రములును, చిన్నపేకతమాషాలుగలవు ఈగ్రంథముజదివినవారు విప్రవినోదులకంటె నెక్కుడుగా ప్రకాశింతురు.

## ప్రౌఢవచనకావ్యములు

60 ధర్మజరాజసూయము. వెల ౧ అణాలు- ఇది బ్ర॥ నేతివెంకటసుబ్బరాయశాస్త్రిగారిచే రచియింపబడెను శైలిమృదువుగానుండును వచనకావ్యముల వ్రాయుట అభ్యసించవలెనన్కోరువారు, ఈగ్రంథముంజదువవలెను.

61 వచననైషధము వెల ౧ అణాలు. ఇది రాజా భుజంగరాయ ప్రణీతము ఇంపగుశైలిగలిగి స్వభావోక్తివర్ణనలతో నుచితముగానున్నది. ౪,౫ సర్గములకు పాఠగ్రంథముగా నచ్చటచ్చట వాడుచున్నారు. ౧౯౦౨ సంవత్సరపు మెట్రిక్యులేషను పరీక్షకు టెక్సుగా యూనివర్సిటీవారేర్పరచినారు.

## నవీనశాస్త్రములు

62 వ్యవసాయము వెల ౪ అణాలు. ఇది రాజాభుజంగరాయ ప్రణీతము ఇందేయేకాలముల నేయే విత్తనములు ఎట్టిభూములయందు ఫలించునో ఆవివరమును, ఏసేద్యమే యేవిధముగాచేయవలెనో దుక్కి, దమ్ము, వెదనీరుకట్టుట కోత, ఆకుపేత, కలుపుతీత, పంటపోత, ఎటులచేయవలెనో వ్రాయఁబడినది.

63 వైద్యుతలోహశాస్త్రము. *or* గిల్టుచేయుట వెల ౬ అణాలు. ఇది డి వి, శర్మగారిచే రచియింపఁబడెను విద్యుత్సంబంధమగు యంత్రముతో గిల్డింగు మొదలయినపనులు ఒకరివలన నేర్చుకొనకయే చదువుకొని చేయుటకు వీలుగానుండును. కంసాలులకుమిక్కిలియుపయుక్తము.

54 అశ్వశాస్త్రము వెల ౬ అణాలు. ఇది అడవిసాంబశివరావుగారిచే రచియింపఁబడినది- గుఱ్ఱములతో వ్యవహారముజరుపు ప్రతివారికిని ఇదిముఖ్యమయినగ్రంథము- అనేకగ్రంథములు పారజూచినగూఢ తెలియని సంగతులీగ్రంథమున స్పష్టముగా తెలియును- సందిగ్ధాంశములు పరిష్కరింపఁబడినవి-

☞ పయివిలాసము మేనేజరు మంజువాణి ఏలూరు గోదావరిజిల్లా.